సంక్రాంతి
విడుదల....

మోసం చేసే వారు
మోస పోక తప్పదని
నిరూపించే నీతికథ..







విజయా
వారి

# అప్పుచేసి పప్పుకూడు



డైరెక్షన్...ప్రసాద్ .. నిర్మాతలు...నాగిరెడ్డి & చక్రపాణి




వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - అ కాలగో పాలూనికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుంది మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాటిది.




# కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళనాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

---

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౩౧] జనవరి 1959 [సంచిక ౧

# విషయసూచిక

ముఖచిత్రం : అమెరికన్ ఆర్ట్ చిత్రము
U. S. I. S. సౌజన్యంతో





Grihalakshmi - Jan - 1959.

——————>

చిత్రంపైన ఎడం పక్క "పద్మశ్రీ" పతకం వున్నది.—ఈ ఏడు ఈ అవార్డు పొందిన వారు: మొదటి వరుస:— శ్రీ సత్యజిత్ రాయ్ (ఫిలిం డైరక్టరు) శ్రీ శంభూ మహరాజ్ (నర్తకుడు) శ్రీ డాక్టర్ ఎస్. పార్థసారథి (విజ్ఞానవేత్త) శ్రీ ఎ. ఎల్. రామదాస్ (విజ్ఞానవేత్త) రెండవ వరుస:— శ్రీ మోటూరు సత్యనారాయణ, శ్రీమతి ఆర్. ఎస్. సుబ్బలక్ష్మి (సంఘ సేవిక) శ్రీమతి ఫతేమా ఇస్మాయిల్ (సంఘ సేవిక) శ్రీమతి దేవికారాణి (ఫిలిం తార) శ్రీమతి నర్గీస్ (ఫిలింతార) మూడవ వరుస :— శ్రీ దేవకీ కుమార్ బోస్ (ఫిలిం ప్రొడ్యూసర్) శ్రీ ఎమ్. టి. వ్యాస్ (విద్యావేత్త) శ్రీ కె. డి. సింగ్ "బాబు" (క్రీడాకారుడు ; డాక్టర్ బి. పి. పాల్ (విజ్ఞానవేత్త) సర్దార్ బల్వంత్ సింగ్ పూరి (సెక్రెటరీ - జనరల్, ఇండియన్ రెడ్ క్రాస్) నాల్గవ వరుస:— ఆచార్య రామచంద్రవర్మ (హిందీ రచయిత) డాక్టర్ ఎ. నాగరాజారావు (ప్రభుత్వోద్యోగి) బ్రిగేడియర్ రామ్‌సింగ్, శ్రీ ఏకాంబరనాథన్ (అంబర్ చరఖా నిర్మాత) డాక్టర్ బి ఆర్. నిరుమాన్ (విజ్ఞానవేత్త.)




అపర్ణ

14-5-67




జయజయ గృహలక్ష్మీ మిత్ర సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## ఈ సంచిక

సంక్రాంతి, నూతన సంవత్సరారంభ సందర్భమున మిమ్ములను హృదయపూర్వకముగా నభినందిస్తూ యీ సంక్రాంతి సంచికను మీ కరకమలముల కందిస్తున్నాము.

ఇరువదియేడు సంపుటములు పూర్తియయి యిది యిరువది ఎనిమిదవ సంపుటపు ప్రథమ సంచిక. ఇంత వరకు మీ ఆదరాభిమానములకు పాత్రమై వర్ధిల్లుచున్న గృహలక్ష్మి పత్రిక యికముందు సయితము మరింత ఆకర్షణీయంగా, ప్రజోపయుక్తంగా జాతీయ సౌభాగ్యాన్ని తీర్చిదిద్దడానికి ఉవ్విళ్లూరుచున్నది.

రచయిత్రులు, రచయితలు తమ అమూల్య రచనలను పంపి మాకు పత్రికా నిర్వహణములో తోడ్పడుచున్నందులకు చాల కృతజ్ఞులము. మేము ఆ నాడు, యీ నాడుకూడ అభ్యుదయ రచనలకు స్వాగతమిస్తున్నాము; రచనలు పరిశోధనాత్మకమైన కృషితోటె, నవీనతతోటి రూపొందడం అత్యవసరము. అట్టి రచనల ప్రచురణకు అవకాశములు మెండు.

అన్ని రంగాలలోను ప్రపంచంతోబాటు మనం, మన దేశం సయితము పురోగమించపూనుకున్నప్పుడు రచనలు సయితము అభివృద్ధి అభ్యుదయాలను ప్రోత్సహిస్తూ పురోగమనాన్ని త్వరితం చేయునవిగా నుండవలెను.

గృహలక్ష్మిలోని గృహవైద్యం, పాకకళ, బాలవినోదం, చిత్రసీమలాంటి శీర్షికలపట్ల రచయితలు, పాఠకులు ఆసక్తిచూపి అనుభవ పూర్వకమైన రచనలు సాగించి పంపినచో ఎంతయైనా ఉపయుక్తము కాగలవు.

ఇంతకాలం జాతీయ సౌభాగ్యముపట్ల ఆసక్తితో, ముఖ్యంగా మహిళాభ్యుదయానికి కృషిచేయుచున్న గృహలక్ష్మి పత్రిక కలకాలము వర్ధిల్లుటవలన, మహిళాభ్యున్నతికి నిర్విరామంగా తోడ్పడిన పూజ్యులు డా॥ కే. యన్. కేసరిగారికి మనము కృతజ్ఞతను తెలిపినవారము కాగలము.

సంక్రాంతి పర్వదినము సకల సౌభాగ్యాలతోబాటు ఉత్సాహ ఉల్లాసాలతో కూడిన నవచైతన్యాన్ని మీకు ప్రసాదించుగాక!

---



జయంతి పిక్చర్స్ వారి 'పెళ్లినాటి ప్రమాణాలు' చిత్రంలో
నొక మధుర సన్నివేశము

# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రాధాకృష్ణయ్య



(గత సంచిక తరువాయి)

## గమ్యస్థానము

ఆత్మ ఎఱుకయనబడు అహంకారరహిత స్థితియందు ద్రష్టకు వ్యతిరిక్తముగ దృశ్యముండజాలదు. యోగులు ఆత్మసంస్కార సాధనయందు ప్రయత్నపూర్వకముగ అంతరకరణములను బుద్ధిని మనమును సూక్ష్మవంతము జేయుచున్నారు. వివిధయోగ సాధనలు ఇట్టి అంతరకరణములను మలరహితముగావించి, పరిపక్వదశకు తెచ్చుటవల్ల, అవి సూక్ష్మవంతమగుచున్నవి.

సాధకుడు పరిపక్వదశ పొందిన వెనుక, ప్రయత్నపూర్వకముగ ఈ స్థూల శరీర భావమును తొలగించుకొనుటకు సాహసపడుచున్నాడు. బాహ్య ప్రపంచమంతయు దేహాభిమానమువల్ల కనబడుచున్నది. దేహాభిమానము వదలినచో ప్రపంచ విషయములు కనబడవు; వాటి బాధలు మనలను హింసింపజాలవు. ఈ మాటలను తొలుత వినువారికి రుచికరముగ నుండవు. కాని స్వయముగ అనుభవించి, జీవించగలిగినవిగా యున్నవి. ఇవి ప్రత్యక్షముగ మన స్వప్న దశయందు, సుషుప్తి దశయందు అప్రయత్నముగ అనుభవించుచునే యున్నాము. ఈ రెండు దశలయందును మనకు దేహాభిమానములేదు. కనుక ప్రపంచము కనబడుటలేదు.

ఇట్లు, దైవికముగ పదునుపొందిన మనోబుద్ధుల సహాయమువలన యోగి తన జీవకేంద్రమగు ఆత్మతత్వమును - తన్ను తాను అంతర దృష్టితో చూచుకొనును. బాహ్యస్థూల విషయ పూరిత కోశములనుండి విడుదల పొందుటవలన, మన నిజ స్వరూపమగు జీవశక్తితో తాదాత్మ్యము కలిగించుకొనుచున్నాము.

శాస్త్రముల వాక్యములు అతి సూక్ష్మము, సూటియు, నిర్వివాదాంశముగ నున్నవి. కాని బ్రహ్మవిద్యయొక్క పరిభాష తెలుసుకొనినంత మాత్రమున ఫలము లభించదు. మర్త్య బంధములనుండి ముక్తి కలుగదు. అఫ్రికాయందలి వన్యజాతి మానవుడు నవీననాగరికతను గురించి గొప్ప గ్రంథములు పఠించినంత మాత్రమున నాగరికతవల్ల కలుగు ఆశీర్వాదములు పొందజాలడు. తన మృగ చేష్టలుగల జీవితమును వదలుకొని, గ్రంథములయందు తెలిపియుండు కళాంశజీవితమును అనుసరించవలెను. అనగా, మనము ఒక ఔషధము పేరును మంత్రమువలె ఎన్ని తూర్లు జపించినను ఔషధము సేవించుటవలన కలుగు లాభము పొందజాలము. అదే విధముగ, వేదాంత సిద్ధాంతములు బుద్ధివలన గ్రహించగలిగినంతటివల్లనే ఎట్టి లాభమును యొసగజాలవు. వేదాంత జీవితమును అనుభవించవలెను. పూర్తిగ అనుభవించవలెను. ఇందు సమాధానములు కుదురజాలవు. రెండు పరస్పర విరుద్ధభావములు ఒకటిగ నుండజాలవు. ప్రకాశముండుచోట అంధకారముండజాలదు.

ఒక సాధకుడు త్యాగముతో తన యాత్రను ప్రారంభించును. తనయందలి దుర్గుణములను త్యాగము చేయును. ఇది సాధన సమకూడుటకుగల నిరసన పద్ధతి. కేవల పట్టుదలతో ఇవి సమకూడజాలదు. సుగుణముల అభ్యాసమువల్ల ఇవి త్వరలో వదిలిపోవును. సాధకుడు నాలుగు మార్గములలో ఒక మార్గమున తన పారమార్థిక జీవితము కొంతకాలము గడుపగలిగినచో, అతనికి అంతరదృష్టి,-జ్ఞానచక్షువు- అను దివ్యశక్తి ఒడగూడుచున్నది. ఈ శక్తి ప్రతియొక్కరియందును గూఢముగ నున్నది. యోగము వల్ల అది ప్రేరేపింపబడుచున్నది. ఇట్టి నూతన గుణ సంపత్తువలన మానవుడు తన స్వారాజ్య పరిపూర్ణ పదవిని చేరగలుగుచున్నాడు.

ఈ అంతరదృష్టి, ఆత్మదర్శనము పొందగలశక్తి, సామాన్యవిషయ దృష్టివంటిది కాదు. సాధనపూర్తి పొందిన సాధకుడు ఈ లోచూపునందు పరిపూర్ణుడగుచున్నాడు. అందుకొరకు గురువు హెచ్చరించుచున్నాడు. "జ్ఞానసంపన్నునికి అది తెలియదు. అజ్ఞానికి అది తెలియుచున్నది."

కేవల పుస్తకజ్ఞానమువలన మత సిద్ధాంతములు పూర్ణత్వము పొందజాలవు. జీవిత దృశ్యమును విమర్శించుట మతసిద్ధాంతము కాజాలదు. హిందువులకు వేదాంతమనగా, జీవిత దృశ్యమే కాదు జీవితమార్గము అని తెలియుచున్నది. వాక్చాతుర్యమువల్ల, స్వాప్నానందమువల్ల వేదాంతి కాజాలడు. వేదాంతము జీవిత విలువలను ప్రదర్శించి, జీవితమున అనుసరించు విధానమును, ఫలమనుభవించు రీతిని, తెలుపగలిగియుండవలెను. సంస్కృతమున, మత సిద్ధాంతములను "దర్శనము" అనబడును. అనగా అందు తెలుపబడు భావములు జీవితమున ఫలించునవి యని తెలుపుచున్నవి.

కేవల వేదాంత శ్రవణమువలన శ్రోతలకు కొంత ఊహాభావము కలుగునుగాని, పరిపూర్ణులు కాజాలరు. వారు జీవితమున వేదాంతమును అనుష్ఠించవలసి యున్నది. కొందరు అజ్ఞానులు, సంసారులకు వేదాంతము పొసగదు అనుచుందురు. నిజముగ, వేదాంత సూత్రముల ననుసరించు జీవితమునకన్న ఉత్కృష్ట జీవితము వేరులేదు.

ఒక నిజమైన వేదాంతుడు సమస్థితిలో నుండును. అతడు జ్ఞానోద్రేకమును కనుబరపడు. భావోద్రేకమువల్ల బుద్ధిమందమగును. విచక్షణ విరాగమువల్ల బుద్ధి సూక్ష్మభావము పొందును. ప్రేమ, దయ, ఓర్పు, అతని మానసిక భావావేశములను విశాలపరచుచున్నవి. ఇట్టి సమశిక్షణపొందిన మనోబుద్ధులు శక్తివంతమగును. విచారము ప్రారంభమగును. వీటి రెంటి సమ్మేళనమువల్ల మూడవ దివ్యశక్తి ఒకటి ఉత్పన్నమగుచున్నది. దానిని "అంతరదృష్టి" లేక "జ్ఞానచక్షువు" అందురు. దీని సహాయమున ఆత్మానుభవము కలుగుచున్నది.

ప్రతిబోధ విదితం మత మమృతత్వం
హి విన్దతే
ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా
విన్దతేఽమృతం॥ 4.

ప్రతి మానసిక వ్యవహారమున, వ్యవహారము ద్వారా, అంతరదృష్టి పొందగల వ్యక్తి, ఖండితముగ, అమృతపదవి పొందుచున్నాడు. ఆత్మవల్ల వీర్యమును, జ్ఞానమువల్ల అమృతత్వము పొందుచున్నాడు.

—(o)—

మనయందు అధిష్ఠానముగనుండు పరమాత్మ మనకు కలుగు మూడు అవస్థలకు సాక్షియని తెలియుటవల్ల అతనిని మనము బాగుగ తెలియగలుగుచున్నాము.

ఒక వ్యవహారమున ఎట్టి జోక్యము కలిగించుకొనక వ్యవహారమును దృష్టించు వ్యక్తి, సాక్షి అనబడును. సాక్షికి వ్యవహారమున ఎట్టి అభిమానముగాని, ద్వేషముగాని లేదు. వ్యవహారమువల్ల ఎట్టి కలతయు పొందక చూచుచుండును. అదేవిధమున ఆత్మ, శాశ్వతము, అమృత స్వరూపము, సర్వవ్యాపకము అకర్త, అభోక్త, కనుక కడుశక్తివంతుడగు సాక్షివలె నున్నాడు.

జాగ్రతావస్థయందలి అనుభవములు స్వప్నమున మిథ్య అగుచున్నవి. ఈ రెండవస్థలు సుషుప్తియందు రూపులేకపోవుచున్నవి. కాని, ఆ వ్యక్తి తన జాగ్రత, స్వప్న అనుభవములను స్మరించుచున్నాడు. సుషుప్తియందు ఎట్టి జ్ఞానానుభవము లేదని తెలుపుచున్నాడు. అనుభవములు స్మరించవలెననగా, వ్యక్తి స్వయముగ అనుభవించియుండవలెను. అనుభవించక అనుభవమును స్మరించవీలులేదు. మీ అనుభవములను నేను స్మరించజాలను. మీరు నా అనుభవములను స్మరింపజాలరు.

ఇందువల్ల మన జాగ్రత, స్వప్న, సుషుప్తులను

అనుభవించు నిత్యసాక్షి ఒకడున్నాడని తెలియుచున్నది. జాగ్రతావస్థయందలి అహంకారము స్వప్నమున లేదు. జాగ్రతావస్థరాగా, స్వప్నము తనకు కలిగెనని తెలుపుచున్నాడు. మన మూడవస్థలలో అవిచ్ఛిన్నముగనుండు అంశమును సర్వసాక్షి, ఆత్మ, అనబడును.

ఇట్టి ఆత్మతో తాదాత్మ్యము పొందుటవలన అహంకార నరకము తొలగుచున్నది. మరణము, పరిమితులు, దుఃఖములు, నిరాశలు, జయము, అపజయము, బాధ, వ్యసనము, ప్రేమ, ద్వేషములు మొదలగునవన్నియు అహంకారముయొక్క సంపద. అది ఈ జీవితమును నలుపుచున్నది. సర్వసాక్షియగు ఆత్మకు సంసారమనునది లేదు. ఆత్మకు ప్రకాశము, శక్తి, జ్ఞానము, ఆనందము, ఇవియే సంసారముగ నున్నది. ఆత్మయొక్క స్వరూపమిట్టిదని తెలియుటవలన ఆత్మ వ్యక్తమునకు, అవ్యక్తమునకు అతీతము అను భావమునగల రహస్యము బోధపడుచున్నది.

ఇహచేదవేదీదథ సత్యమస్తి
నచేదిహావేదీన్మహతీ వినష్టిః
భూతేషు భూతేషు విచిన్త్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి॥ 5

బ్రహ్మను ఇచ్చట ఈ లోకమున తెలుసుకొనినచో, మానవ పరమావధి లభ్యమగుచున్నది. తెలియలేనివానికి కలుగు నష్టమునకు మేరలేదు. జ్ఞానవంతులు సర్వభూతములలోనుండు ఏక ఆత్మను తెలుసుకొని, ఈ మర్త్యలోకమును వదలి అమృతత్వము పొందుచున్నారు.

—(o)—

ఇవి శ్రుతిమాతయొక్క ప్రేమ ప్రవాహ ఆదరణ. తన సంతతి బిడ్డలు ఎదిగియున్నారు. కనుక ఈ జన్మముననే పూర్ణఫలముపొంది బంధములు తొలగించుకొనవలెనని ఆశ. మానవుడు ముక్తస్వరూపుడు. ఆ ముక్తి వెదకి తన స్వాధీనముచేసుకొనుటకే జన్మమెత్తియున్నాడు. వేలకొలది జన్మములెత్తి, కడవలుగ కన్నీరు కార్చుటవలన, కరుణామయుడగు భగవంతుడు మనకు దుర్లభమగు మానవజన్మమిచ్చియున్నాడు.

మానవజన్మము దొరుకుట కడు అరుదు. అందు సర్వాంగ సౌష్టవము కలిగియుండుట అదృష్టము. అనేక జన్మములయందు చేసిన భక్తి తపస్సుల ఫలితముగ, మానవునియందు, శారీరక, మానసిక, పారమార్థిక సంపద చేకూరుచున్నదని శాస్త్రములు తెలుపుచున్నవి.

ఇన్ని సుగుణములు కూడియుండియు, శ్రుతిసమ్మత పరమాత్మ జ్ఞానము లేకున్న యెడల అంధకార దుఃఖరాశిలో దొర్లుచుండవలసియున్నది. మీ అందరి పుణ్యము ఎంతని పొగడగలను. మానవరాశిలోని నవనీత మనునట్లు ఉత్తమ దశపొందియున్నారు కనుకనే ఉపనిషత్తు శ్రవణభాగ్యము మీకు లభించినది. వ్యక్తస్వరూప పరమాత్మనైనను తెలుసుకొనగలుగుచున్నారు.

మీలో ఒక్కొక్కరు, సంసార పంకమనుమాయయందు అల్లాడు కోటిన్నర రూపక్రిములకన్న ఎంతో ఉత్తములు. అందువలననే శ్రుతి. ఈ జన్మముననే ఆత్మదర్శనము పొంద యత్నించనివారి నష్టమునకు మేరలేదు అని తెలుపుచున్నది.

త్యాగములేనిది నిత్యజయము లేదని మానవ జీవిత చరిత్ర తెలుపుచున్నది. ప్రకృతియందు ఈఘోషకనబడుచున్నది. చేపలు గాలిలో తమ రెక్కలతో ఎగురవలెనని నచో, నీటిని త్యజించి బైటరావలెను. పక్షులు తమ ఎగురగల శక్తిని త్యజించినచో, మృగములకు సమానము కాగలవు. మృగములు తమ స్థూల శక్తులను త్యజించినచో, సూక్ష్మ మానసిక, విజ్ఞాన శక్తులు పొందగలవు. అడవిమనిషి తన లోకను, వన జీవితమును త్యజించినచో, కోటు, బూటు హాటు తొడుగుకొను వ్యాపారివలె తయారగుచున్నాడు. మానవుడు ప్రయత్నించగల కడపటి సాధన, దైవ

పదవి పొందగల యాత్రయందుండు పరిశ్రమ, శ్రుతియందు తెలియుచున్నది. జ్ఞానపురుషులు, ఏకగ్రీవముగ “మానవుడు కించిత్తు త్యజించుటవల్ల, దైవపదవిని చేరుచున్నాడు” అని తెలుపుచున్నారు. అహంకారమును త్యజించి, భగవంతుడు కావలెను. ఇది ఇచ్చట ఇప్పుడు సాధ్యము. విచక్షణతో, ప్రతి నామరూపమున యందుగల ఏక ఆత్మను కనుగొనవలెను. ఇదియే ఉత్కృష్ట ఉపాసన. దీని ఫలితముగ ఆత్మమందిరము చేరుచున్నాము. అతనిని కంటికి కన్నవలె నేరుగా చూచి అతనితో లయము కాగలము. ఆత్మను చూచిన వ్యక్తి ఆత్మయగుచున్నాడు. “బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి.”

## ఇచ్చట – ఇప్పుడు

మానవుడు శరీరసౌఖ్యములను మానసిక కోరికలను పూర్తిజేయుట కొరకు జీవితమునంతయు వృథా పుచ్చుచున్నాడని శ్రుతిమాత చాల విచారించుచున్నది. మానవునికి అపరూప జన్మము దొరకియున్నది. ఇంద్రియములు చక్కగనుండి, మనోబుద్ధులు తగుపరిపక్వదశపొందియుండియు, సత్పురుషుల నాశ్రయించి జ్ఞానబోధ పొందకుండినచో మరల ఇవి దొరుకబోదు. కనుక కడుదయతో, కనికరముతో హెచ్చరించుచున్నది. “ఆత్మవిషయము ఇచ్చట తెలుసుకొనని మానవుని నష్టమునకు మేర లేదు.”

నామ రూపములలో అంతర్భూతమైయుండు ఆత్మాంశమును కనుగొనిన మానవుడు ఆత్మజ్ఞానమున పరిపూర్ణానందము ననుభవించును. అతడు ఈ లోకమును వదలి అమృతస్వరూపుడగుచున్నాడు.

ఈ భావమును ఆధారముగనుంచుకొని రెండు మతములు ఏర్పడియున్నవి. ఒకటి ఈ స్థూలదేహమును వదలిన వెనుక, అనగా, మరణానంతరము పరిపూర్ణ పదవి పొంద సాధ్యము అని. రెండవది, దీనికి వ్యతిరిక్తముగ, బ్రహ్మత్వము, ఈ దేహమున జీవించియుండగనే సాధ్యమని శ్రుతి అభిప్రాయము తెలుపుచున్నది అని తలచుచున్నారు. మొదటి మతము విదేహముక్తినే అంగీకరించుచున్నారు. రెండవవారు జీవన్ముక్తి సాధ్యమనుచున్నారు.

వీటిలో శంకరాచార్యులు రెండవ మతమును ఆమోదించుచున్నారు. అతని తర్కములు ఆదరణీయముగ నున్నవి. ఈ చిన్మయులు సందర్శించగల మహాత్ములందరును ఏకగ్రీవముగ, వాక్యముల రూపమున జీవితవ్యవహారరూపమున జీవన్ముక్తి సాధ్యమనియు మానవుడు ఈ జీవితముననే బ్రహ్మపదవి ననుభవించవచ్చునని తెలిపియున్నారు. ఆత్మసాక్షాత్కారము ఇప్పుడు, ఇచ్చటనే సాధ్యము.

పరిపూర్ణశ్రోత్రియుడు, బ్రహ్మపదవినందు స్థాపితముగల మహాత్ముడు గురువుగ నుండగలడనుటనుగూర్చి, శంకరుల అభిప్రాయమును ముందు వివరించియున్నాము. శ్రుతుల జ్ఞానమువల్లనే పూర్ణగురువు కాజాలరు. విదేహముక్తి నిజమయినచో, ఒక సాధకుడు స్వప్రయత్న ఫలముగ ఆత్మవిద్యవల్ల పరిపూర్ణ పదవి పొందగలిగినచో, అతడు తక్షణము తన దేహమును త్యజించవలెను. అనగా అతని దేహము మరణించవలెను. అది విదేహముక్తి అనబడును. కాని, మనకు బ్రహ్మనిష్ఠయందు స్థావరముగనుండు గురువు లభ్యము కాజాలడు. కనుక జీవన్ముక్తియే ఒప్పదగియున్నదని శంకరుల తీర్మానము.

“ఈ లోకము వదలి అమృత పదవి పొందుచున్నాడు” అను శ్రుతివాక్యముల అభిప్రాయమేమిగానుండును. ఇచ్చట వదలుట అనగ, మరణమువల్ల దేహమును వదలుట కాదు? మర్త్యబంధములను తొలగించుకొని, మృగచేష్టలు, విలువలు వదలి దివ్య ఎఱుకవల్ల తాను బ్రహ్మమని తెలియుటగా నున్నదని శంకరుల అభిప్రాయము.

వేదాంత సాధనవల్ల మానవుడు అమృత స్వరూపుడగుచున్నాడని శ్రుతి నమ్మకము తెలుపుచున్నది. మానవుని, శరీరము, మనసు, వీటిపరిణామములన్నియు భూతసంభవములు.

(సశేషము)

# ప్రేమిక దంపతులు — చంద్రలోకపు —

## (ఊహా చిత్రము) — మధుర స్మృతులు —

కీ। శే। ఆకుండి వ్యాస ప్రభాకరశాస్త్రి

"శంకర్! మహోదాత్తమైన నీ త్యాగము, విశ్వకళ్యాణ విజ్ఞానాభివృద్ధికై నీవొనర్చు కృషికి నేనెంతయు సంతసించుచున్నాను. నీ వంతటి పనికి పూనుకొన్నప్పుడు నిండు మనంబుతో నిన్ను పంపెదను. వీరపత్నినైతినని సంతసించుచున్నాను."

"లీలా! నాయదృష్టముచే నీవు నాకు భార్యవైతివి. నిష్కళంక ప్రేమతో నన్నర్థము చేసికొంటివి. చందమామ మనకు సాక్షి. అతనిని దర్శించి విశేషముల నరసి త్వరలో నిన్ను కలసికొనెదను. ప్రేమతో నిన్ను వదలలేకున్నాను. అయినను ఈ ధైర్యమే నన్ను ప్రోత్సహించుచున్నది."

శంకర్ స్ఫురద్రూపి. విద్యావంతుడు, ఉన్నత వంశ సంజాతుడు. ఎమ్. ఎస్‌సి. పూర్తిచేసి గవర్నమెంటు స్కాలర్ షిప్పులతో విదేశాలలో విజ్ఞాన పరిశోధనలు సాగించాడు. రాకెట్టులు, ఉపగ్రహాలు, అతని విమర్శనాశక్తిని, నూత్న ప్రదేశ సందర్శనాభిలాషను ప్రోత్సహించాయి. చంద్రగ్రహ విశేషాలను భూలోక వాసులకు అందజేయాలనే తదేక దీక్షతో ప్రాణ సమానమైన అర్ధాంగి యొద్ద సెలవు తీసికొన్నాడు.

ఆకాశంలో ప్రయాణం సుగమంగా సాగిపోయింది. గాలిలో మార్పులు మానవుని మనుగడికి అడ్డమయే పరిస్థితులు గోచరించాయి. కృత్రిమ సాధనాలతో ఊపిరి నిల్పుకొంటూ పయనము సాగించాడు, కొద్దిదూరం. 'లైకా' స్థితికి దిగజారి పోతాడనుకుంటున్నాడు ...

విశ్వాంతరాళంలో అనేక గ్రహ రాశులు ప్రకాశిస్తున్నాయి. భూమి, చంద్రుడు సూర్యుని చుట్టితిరిగి వస్తున్నాయి. స్వయంప్రకాశమగుటచే సూర్యమండల ముత్కృష్టమైనది. ఆ కనిపించేదే చంద్ర మండలము. సుప్రసిద్ధ స్ఫటిక శిలామయ గోళము. సూర్యకిరణాలు ఆగోళముపై ప్రతి ఫలింపగా శీత కిరణాలు వెదజల్లుతూ ఉంది. ఆ దేశపు రాజు; చంద్రమహారాజు, 27 మంది భార్యలు, పట్టమహిషి, ప్రియురాలు తారాదేవితో విలాసాల తేలుతున్నాడు. భార్యలకందఱకు 27 చంద్ర కాంత శిలామయ భవనాలు నగరము

చుట్టూ నిర్మించాడు. దినమున కొక భార్యతో విహరిస్తూ ప్రజల ఆరోగ్యరక్షణయందు, విద్యాలయందు ప్రత్యేక ఆసక్తి కనబరుస్తూ న్యాయంగా పరిపాలిస్తున్నాడు.

"ప్రభూ! ఏలినవారి ఉద్యానవనంలో ఈతడు పడియున్నాడు. అందము, ముఖంలో వర్చస్సుచూచి మీయొద్దకు యీతనినితీసికొనివచ్చాము; ఆపై ప్రభువుల చిత్తము" అని యొక శవమును చంద్రమహారాజు ముందుంచినారు అతని ఉద్యానవన పాలకులు.

నిశ్చలమై, నిర్మలమై, ముఖంపై తాండవించే కళ కనుగొని చంద్రమహారాజు తన వైద్య నిపుణతచే అతనిని పునర్జీవితునిచేయ ప్రయత్నించెను. శీతలోపచారములు చేసిన వెనుక సేదదేరి మెల్లగ కన్నులువిప్పి ఆసభాంతర స్థితమహోన్నత విగ్రహములగాంచి దిగ్భ్రమజెంది రాజు ముఖమండలి ఆనందచిహ్నముల చూచి తేరుకొని "ఆర్యా? ఇది ఏదేశము? నేనెందుకున్నాను? ఏమిజరుగుచున్నది?" అని తన మాతృభాషయగు ఆంధ్రమున ప్రశ్నించెను. వారందరును ఆరు అడుగుల పొడుగుననున్న ం. తనినిచూచి నవ్వుకొనసాగిరి. మహారాజాతనికి ఫలహారముల తెప్పించెను. మానవ సహజముగ ఆశతో వెంటనే తినబోయెను. అవి పంచదార కన్న నెక్కువ తీపిగను చల్లగను ఉండుటచే ఎక్కువ తినజాలకపోయెను. త్రాగుటకేదైన కావలెనని సంజ్ఞలుచేసెను. క్షీర పాత్రము నొకదానిని ముందిడిరి. అదియు తీయనై అతని దప్పిక తీరలేదు. మహారాజది గ్రహించి సెలయేటి నీటిని తేబంచెను. ఆ నీరము గ్రోలగనే గాలి ఒత్తిడి వలన తనయందు గలిగిన మార్పులు వైదొలగ ఉత్సాహముతో మహారాజునకు నమస్కరించి:-'రాజా! నేను భూలోకవాసిని మానవులుచేయు ప్రయత్నములలో సాయపడనెంచి చంద్రమండల రహస్యముల తెలిసికొనగోరి విమానముపై బయలుదేరినాడను; మార్గమధ్యమున స్పృహ తప్పినది. ఇప్పుడు ప్రభువులను గ్రహించిన నీరముచే తిరిగి బ్రతికితిని. ఇచటినుండి చంద్రగోళమునకు పోవుమార్గమును తెలుపగోరెదను' అని వినయముగా ప్రార్థించెను. అవి యన్నియు వారికి అర్థమైనట్లు గోచరించలేదు.

చంద్రమహారాజు అతసని తన కుమార్తె 'ప్రేమ' భవనమునకు కొనిపొండని ఆజ్ఞాపించెను. ప్రేమ విద్యావతి, రూపవతి, విలాసవతి, సుగుణనిధి. జాలి, కరుణ, ఆమెకు అలంకారములై ఉన్నాయి. తన తల్లి 'పూర్ణిమ'కు అల్లారు ముద్దుబిడ్డ. తండ్రికి మంత్రివలె రాజకార్య నిర్వాహకురాలు.

(సశేషము)

# ప రి ణా మ ము

## శ్రీ గాడేపల్లి శంకరం

——(०)——

(గతసంచిక తరువాయి)

### తృతీయాంకము :

ఒకటవ రంగము

ప్రదేశము:—వీధి

ప్రవేశము:_డాక్టరురావు - దుర్గాబాయిల నాయకత్వంక్రింద ఒక వలంటీరుదళం ఉప్పుపాట పాడుకుంటూ ఉప్పు సత్యాగ్రహానికి ఊరేగుతూ వెడుతుంది - ఉన్మత్తుడు వాళ్ల వెనుకనే ప్రవేశిస్తాడు.

అహ్హాహ్హాహా - నాటకమాడుతున్నారయ్యా - నాటకం - పిండారీ పితూరీలో పిడుగులు పడితే - శిపాయీల కలహంలో సిస్పింద్రీలు కాలాయి - ఝాన్సీబాయమ్మ ఝూంకారానికి - సాహేబ్ నానాగారి సహకారం దొరికింది - వహ్వా - బాగుందంటే - బాగుందనుకున్నారు - పాపం లడాయీకి లాభంలేకపోతే బ్రిటిష్ బడాయీతో భాయీ భాయీ అన్నారు కొన్నాళ్లు - వహ్వా - వహ్వా - భాయీ భాయీ అంటూనే భావిభారత రాజకీయ సౌధానికి పునాదిరాళ్లు వేసేశారుకాదూ? ఓహో! వివిధమార్గాల్లో విజృంభించియున్న బానిసతనం మీద విచ్చుకత్తులు తాండవమాడలేదు! రామమోహనుడు సహగమనం మీద చావు దెబ్బకొడితే - దయానందుడు - పరమత వ్యాపకాన్ని పట్టుడకొట్టాడు - అహ్హాహ్హాహా! మతవిభేదాలు రూపుమాపిన మనరామకృష్ణుడు - విజ్ఞానశక్తులుదయింపచేసిన వివేకానందుడూ లేరూ? మతసంరక్షణకోసం మరణమే స్వీకరించిన శ్రద్ధానందునికి శ్రద్ధాంజలి సమర్పించని వారుంటారాబాబూ! అనిబిసంతమ్మ అడయారులోనూ-రాధాస్వామిగారు దయాల్‌బాగులోనూ - రమణమహర్షిగారు తిరువణ్ణామలైలోనూ - ఊరికే కూర్చున్నారా?

అరవిందుని కలం అగ్నికణాలు క్రక్కితే రవీంద్ర కవీంద్రుని వాఙ్మయం రణబీజాలు నాటింది -

ఖర్జను దొరగారి గొడ్డలి పెట్టుతో వంగ రాజ్యంలో వందేమాతరం తొంగిచూసింది కాదూ - బ్రిటిష్‌బింకాన్ని "గాడరు" సంఘం గడగడలాడించ లేదుటయ్యా! కాని ఇదేమి పాపమయ్యా! తుంటిని కొట్టితే మూతిపళ్లు రాల్తాయిట! అహ్హాహ్హాహా మంత్రాలకి చింతకాయలు రాలే రోజులుపోయాయండోయి - పోయాయి! తంత్రానికీ యంత్రానికే పని ఎక్కువగావుందిప్పుడు - విడ్డూరాలూ విపరీతాలూ - చెవిని పడుతూవుంటే - కామోసనుకునే వెర్రికామయ్యల కంటిముందరే జరుగుతున్నాయిగా! ఓహొహోరి మీ తలశిఖ పండా - పొడుందుకాణం వాడికికూడా పోయేకాలం వచ్చిందా! అహ్హాహ్హాహా హరతాళంట - అరతాళమూ పావుతాళమున్నూ - ఓరి మీ యిల్లు బంగారం గాను - ఉప్పు సత్యాగ్రహంతో ఉన్న ఉద్యోగాలు ఊడగొట్టుకొని - పప్పు సత్యాగ్రహంలో ప్రభువులవుతారు కాబోలు! హిహిహీ - ఈ పప్పులూ ఉప్పులూ ఇంగ్లీషువాడి దగ్గర ఉడకవు జాగ్రత్త: "ఆశయాబద్ధతేలోకే కర్మణారి బహుచింతయా:" అన్నారు పెద్దలు - ఆ మాట మరిచిపోకండి మరి - అయితే దండీ సత్యాగ్రహంతో - స్వరాజ్యం దసరానాటికే వస్తుందన్న మాట - మహబాగావుంది - భేషుగ్గావుంది - అవునుగాని - ఉండి ఉండి కాలు ఉప్పులో వేశారేమయ్యా! ఓహోహోహో - వాద ప్రతివాదాలు

చేసే వకీలుగారికీ ఉప్పే - వ్యాధిని నివారించే వైద్యుడికీ ఉప్పే - వాణిజ్యం చేసుకొనే వర్తకుడికీ ఉప్పే - పాఠాలు చెప్పే బడిపంతులకీ ఉప్పే - విద్యను నేర్చే స్కూలు విద్యార్థికీ ఉప్పే - వంటలవాడికీ ఉప్పే - వడ్డన వాడికీ ఉప్పే అయితే - తిండిపోతురాయళ్లకు ఉప్పు కషాయంగా ఉందయ్యా! పప్పులో ఉప్పు ఎక్కువైంది! తన్ను - తవ్విపాతేయించు - కొట్టు! కోదండం తీయించు - లాఠీ చార్జి! లాఠీ చార్జి! నూటనలభై నాలుగో సెక్షన్! ద్వీపాంతరవాసశిక్ష! విడిఖైదా! విడిది ఖైదా! పట్టుకో - పట్టుకో (అంటూ వెళ్ళి పోతాడు)

(తెర)

తృతీయాంకము రెండవ రంగము

ప్రదేశం:- ఒకక్లబ్బు - హాలులో రెండు టేబిల్సు దాని చుట్టూ కుర్చీలు - ఉంటాయి - బల్లలమీద పత్రికలూ పుస్తకాలూ ఉంటాయి -

ప్రవేశం:- మూర్తి - ఓ కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటూ ఉంటాడు - ఐ. సి యస్ పరీక్షకి లండను వెళ్లి వచ్చాడు. ఫుల్ సూటులో ఉన్నాడు - తెర తీస్తుంది -

డా. రావు
దుర్గాభాయి } (ప్రవేశిస్తారు)

డా. రావు:- (మూర్తితో) ఇదిగో మూర్తీ! ఎప్పుడు రావటం?

మూర్తి - మొన్ననే వచ్చానండి!

దుర్గాభాయి: హార్టికంగ్రాట్యులేషన్సు మిస్టర్ మూర్తి (అని కరస్పర్శ చేస్తుంది) పరీక్ష ప్యాసయ్యావుట కాదూ?

మూర్తి: ఔనండి - థాంక్యు వెరీ మచ్ మేడమ్?

డా. రావు: అంతా క్షేమమా!

మూర్తి:- ఆ! అంతా క్షేమంగానేవున్నారు.

డా. రావు:- నువ్వు ఐ. సి. యస్ పరీక్షకి లండను వెళ్లడానికి మొదట్లో మీనాన్న ఎంత ఉత్సాహం చూపించాడో - తరువాత పాపం అంత బెంగపెట్టుకున్నాడోయి -

మూర్తి:- అవును ఆశ్చర్యం ఏముందీ? పెద్దవాడై పోయాడు మరి.

డా. రావు:- అందులో ఒక్కగాను ఒక్కకొడుకువి. పంచప్రాణాలు నీమీదే పెట్టుకొని - శ్రమపడి పెంచుకున్నాడు మరి - మీ అమ్మ పోయిన తరువాత మళ్ళీ "ద్వితీయం" తలపెట్టక పోవడానికి ఇదేకూడ కారణం అనుకుంటాను.

మూర్తి:- అవును - ఆయనకి నా మీద ఉన్న అనురాగానికి అంతు లేదు లెండి - దానికితోడు మా అక్కయ్య కాంత దూరదేశంలో ఉండటంచేత మరీ బెంగపెట్టుకున్నాడు.

డా. రావు:- పాపం - ఇంతకూ ఆయనపడిన కష్టానికి ఫలితం చేకూరిందిలే -

దుర్గా:- ఎక్కడ పోస్టుచేశారు మూర్తీ!

మూర్తి:- ఏదీ! ఇంకా తెలియలేదండి. Expecting orders.

డా. రావు:- ఆ శుభవర్తమానం - ఈ శుభవర్తమానం ఒకసారే వస్తాయేమోలే -

మూర్తి:- అదేమిటండోయి రావుగారు - ఆ శుభవర్తమానం ఏమిటి?

డా. రావు:- అదే - పత్నీ స్వీకారము - పదవీ స్వీకారము ఒక్కమారుగానే జరుగుతాయేమోలే అంటున్నాను.

మూర్తి:- (నవ్వి) ఓస్ అదా! - అవునుగాని - మీ ప్రాక్టీసు ఎలా ఉందండీ?

డా.రావు:-ఆ! ప్రాక్టీసుకేమి - ప్రాక్టీసు బాగానే వుంది ఈవేళవరకూ - ఇదిగో మా గాంధీగారు మళ్లీ శాఖీదు పంపారుగా - ఈవేళో రేపో నాకూ యెరెస్టు వారంటు వస్తుందని అనుకుంటున్నాను.

మూర్తి:-1920లో - నాచిన్నప్పుడు మీకు రెండేళ్లు శిక్ష వేశారు కదూ?

డా.రావు:-ఆ! 1920లో రెండేళ్ళు కారాగారవాసం అయింది. ఈ ముక్త్పైలో మూడేళ్లయినా అధమాధమంతప్పదు - (సంతోషంగా చెబుతాడు)

మూర్తి:-ఈధఫా Movement జోరుగానే నడుస్తోందండీ!

డా.రావు:-జోరంటూ లేమిటి? మహాజోరుగా నడుస్తోంది!

మూర్తి:-ఈవెన్ విమెన్ ఆర్ జాయినింగ్!

దుర్గాభాయి:-అవునూ! ఆడమగ వివక్షతగాని, పసిబాల వృద్ధులనే తారతమ్యంగాని లేకుండా ఆబాలగోపాలము — మహాత్ముని ఆదేశానుసారం నేటి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొంటున్నారు.

మూర్తి:-అవునండీ లండన్ పేపర్లలో కూడా చూస్తూవుండేవాడిని - ఈసారి పొలిటికల్ ఫీవర్ పల్లెవాసులవరకూ ప్రాకిపోయింది.

దుర్గా.మూర్తి:-వాళ్ల పత్రికలలోకూడా మూమెంటునుగురించి బాగా వ్రాస్తారా?

మూర్తి:-వ్రాయకేం - అధికారంలోవున్న పక్షానికి చెందినవి ప్రకటించక పోయినా లేబరు పార్టీ వారి పత్రికలు లేవూ?

డా.రావు:-మూర్తీ! ఇప్పటి తమాషా ఏమిటీ అంటే బాలగంగాధర తిలక్ - బిపిన చంద్రపాలూ — లాలాలజపతిరాయి ప్రభృతుల కాలంలో - నగరాల్లోనూ పట్టణాల్లోనే వీచిన స్వాతంత్ర్యోద్యమ పిల్లవాయువులు - మహాత్ముని సారథ్యం కారణంగా—మహోజ్వల ప్రళయ ఝంఝామారుతమై - పల్లె పల్లెకూ, ప్రాకిపోయింది - దీనికి ఆయన నిరంతరకృషి, స్వచ్ఛంద సేవాదీక్షయే కారణం -

దుర్గా:-ఉప్పు సత్యాగ్రహంలో ఉన్నవాడూ లేనివాడూ అనే భేదంలేదు సరికదా - స్త్రీలుకూడా ముందంజవేసి ఉద్యమంలో పాల్గొంటున్నారు. ఒకటీ రెండూ కాదు-వేలాది స్త్రీలు లక్షలాది పురుషులూ శ్రీకృష్ణజన్మస్థానం అలంకరిస్తున్నారు.

మూర్తి-అయితే ఈ తుపానుగాలి తగలని భారతీయుడే ఉండడనిపిస్తోంది.

డా:రావు:-సందేహమేమిటి? లోకోత్తరపురుషుడైన గాంధి మహాత్ముడు లోకకళ్యాణార్థం తలపెట్టిన మహాయజ్ఞంయిది — ఈ యజ్ఞానికి యిప్పుడు అవసరం కలిగించిన బుద్ధిమంతులుకూడా - ఆబ్రిటిష్ వారే కాదూ - 1929లో సైమన్ కమీషన్ భాగోతం నీవెరుగవూ?

మూర్తి:-ఆ! ఎరుగకేమీ - ఓడదిగినది మొదలు — వాళ్లు తిరిగి ఇంటిముఖం పట్టేవరకూ నానాగోలా చేశారు - న్యూస్లు కాలేజీలు కట్టేశారు.

డా.రావు:-తిరస్కార సభలూ — నల్లజండాల సన్మానాలే కాదూ వాళ్ళకు - ఎక్కడికి వెళ్ళినా ఎదురైందీ! ఆ సందర్భంలోనే - నిషేధాలు - లాఠీచార్జీలు ప్రభుత్వం ప్రయోగించగా - జవహార్‌లాల్ లజపతిరాయి ప్రభృతులు పాపం లాఠీ దెబ్బలుకూడా తిన్నారు - చివరకు లజపతిరాయి మంచంపట్టి మరణించాడు కూడాను - పాపం!

దుర్గా:-దేశంలో అట్టుడికినట్టు అప్పటినుంచీ ఉడుకుతూనే వుందయ్యా మూర్తీ మన ఆంధ్రదేశంలో మాత్రం - చూడు ఎంతటి చైతన్యం కలిగిందో!

మూర్తి:అప్పుడే కాబోలు - లార్డ్ ఇర్విన్ ఇంగ్లాండు వెళ్ళి దేశంలోని ప్రజాభిప్రాయాన్ని బ్రిటిష్

వారికీ తెలియపరచి - కనీసం డొమినియన్ స్టేటస్ అయినా ఇండియాకి యిచ్చి తీరాలని పట్టుపట్టాడు !

డా. రావు:-అవును — తరువాతనే అతడు ఇండియాకి తిరిగివచ్చి-క్రిందటి సంవత్సరం — అధినివేశ రాజ్యాంగ పద్ధతే భారతరాజ్యాంగ అభివృద్ధికి సహజపరిణామం అంటూ అస్పష్టంగా ప్రకటించాడు - ఈ ప్రకటన కాంగ్రెసు వారిని తృప్తి పరచలేదు. 1929 డిశంబరు 30 వరకూ గడువు పెట్టి - ఆ గడువులోపల బ్రిటిషువారు ఏదో ఒకటి అవశ్యం ఇండియాకు చెయ్యాలని కాంగ్రెసువారు అన్నారు - ఆ గడువు దాటి పోయిన తరువాత - బ్రిటిషువారితో పూర్తిగా కాంగ్రెసువారు సంబంధము వదలుకొని - సంపూర్ణ స్వాతంత్ర్యమే తమ పరమలక్ష్యంగా ప్రకటిస్తూ - మొన్న 1930 జనవరి 26వ తేదీని ఓం ప్రథమంగా - స్వాతంత్ర్య దినోత్సవాలు దేశమంతా జరిపారు — గాంధీమహాత్మునికి సర్వాధికారాలూ యిచ్చి సారథిని కమ్మన్నారు.

దుర్గా:-దేశంలోగల దరిద్రాన్ని తొలగించటానికి ముందుగా కొన్ని సంస్కరణలైనా చేయాలని లార్డ్ ఇర్విన్‌కి లెటర్ వ్రాస్తూ మహాచక్కని పాయింట్సు ఉదహరించాడండీ !

మూర్తి:-మహాత్మాజీ ఈజ్ యె గ్రేట్ పొలిటీషియన్!

డా. రావు:-నెమ్మదిగా అంటావేమిటి? అంతటి రాజనీతిజ్ఞుడు నభూతో నభవిష్యతి

దుర్గా:-ఆ పాయింట్సు ఏవీ చెప్పండి రావుగారూ - మీనోటి వెంటే వినాలి.

డా. రావు:(నవ్వి) మొట్టమొదట త్రాగుడు పూర్తిగా నిషేధించాలన్నాడు — రూపాయికి ఒకషిల్లింగూ నాలుగు పెన్నీలకు మారకపురేటు మార్చాలన్నాడు - భూమి పన్నులో సగానికి సగం తగ్గించటం - ఉప్పు పన్ను తీసెయ్యడం - సైనిక వ్యయాలు - ప్రభుత్వోద్యోగులజీతాలు తగ్గించటం - విదేశవస్త్రాలమీద పన్ను విధించటం - సి. ఐ. డి. వారిని రద్దు చేయడం - ద్వీపాంతరవాస శిక్షితులనీ - రాజకీయ ఖైదీలనీ విడుదల చేయటం - ప్రజలనౌకా వ్యాపారచట్టాన్ని అంగీకరించడం - ఆఖరిది స్వరక్షణకోసం — ఆయుధాలుంచుకోడానికి అనుజ్ఞయియ్యడం - ఈ కనీసపు కోర్కెలైనా బ్రిటిషువారు ఖచ్చితంగా తీర్చాలన్నాడు,

మూర్తి:-ఆహ్హాహా - గాంధీమహాత్ముడు మహగడుసువాడు. ఈయనకు తాతలు వాళ్లూ - వాళ్లెందుకు ఇస్తారు !

డా. రావు:-అందుకోసమే ఈ ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించాడు - మహాధ్వజాయమానంగా - భూనభోంతరాళాలు మారుమ్రోగిస్తూ - సత్యాగ్రహోద్యమం సాగిపోతోంది - ఎవడాపగలడు?

దుర్గా:-అవునులెండి ! కృష్ణశాస్త్రిగారన్నట్లు "అవని అంతా పెద్ద అక్షయపాత్ర" అయికూర్చుంది మరి-ఆకలికలిగితే ఎంతటి ఆగ్రహావేశాలైనా వస్తాయికదూ?

డా. రావు:-రత్నగర్భయని పేరుపడసిన భారతదేశం పరదేశీయుల చేతుల్లో చిక్కి శల్యావశిష్టమై పోయింది. తిండీ బట్టా లేకపోవడం సరికదా - నిలువడానికి నీడైనా లేని కోటానుకోట్ల ప్రజలు ఎంతకాలం ఈ దరిద్రాన్ని అనుభవిస్తారూ? ఈ దరిద్రానికితోడు-స్వార్థపరుల కల్పిత దురాచారాలు - అగ్రజాతీయుల నిరంకుశత్వాలు - బానిసలుకంటే నీచాతినీచమైన పరప్రభుత్వ దాస్యశృంఖలాలు ఎంతకాలమని ప్రజలు సహిస్తారు బాబూ?

మూర్తి:-అవునండీ ! అజ్ఞానమనే ఈ అంధకారానికి స్వతంత్ర భానుడు ఉదయిస్తే — చేయెత్తి నమస్కారం చేయవలసిందే

దుర్గా:-ఆనాడుగాని సంఘంలో ఉన్న మశ్ళను కడిగి వేయడానికి వీలుండదు - అప్పుడుగాని

యొకనమిక్స్ అండ్ సోషల్ ఫీల్డ్స్ లో యెడ్వాన్సుమెంటుకి తావుండదు - పాపం ప్రజలు ఈనాటికైనా మేలుకున్నారు నయమే!

డా. రావు:- మేలుకోరూ! 1905లో మా శర్మగారు ఓ పద్యం చదివేవారు - "ఏటేట నిటనుండి నూటయేబది కోట్ల రూప్యముల్ పోయి యూరోపుబడిన - పులిమీద నూగు బలశాలి హిందువు పిల్లిజూచిన పారుపిరికియైన -" అని అంటూ "నిద్రపోయెదవేల దరిద్రులార మేలుకొనుడింక మీ దేశమేలుకొనుడూ" అని చదివేవారు - ఆనాటి మేలుకొలుపులు ఈనాటికైనా ప్రజలను మేలుకొలిపాయి — క్రమంగా స్వతంత్రమూ వస్తుంది - కాలక్రమంలో అన్ని మార్గాలలో అభివృద్ధి ఉంటుంది.

మూర్తి:- శర్మగారు అప్పుడే జయిలుకి వెళ్ళినట్టున్నాడు.

డా. రావు:- అబ్బే - ఇంకా లేదు - మాకందరికీ ఒకసారే వస్తుంది యెరెష్టువారంటు - ఇవాళ శ్రద్ధానందఘాటులో శర్మగారి ఉపన్యాసమేవుంది - వస్తావా?

మూర్తి:- అల్లాగే.

దుర్గా:- మీరు మరిచినట్లున్నారు - అతడు కాబోయే కలెక్టరుగారు! కాంగ్రెసు మీటింగుకి వస్తాడా?

డా. రావు:- అవునోయి! ఈ సంగతి మీ నాన్నకి తెలిస్తే కర్ర పుచ్చుకుంటాడు - నీ మీదే ఆయన బోలెడంత ఆశ పెట్టుకు కూర్చున్నాడు ఏదో కూసేదివచ్చి - మేనేదాని నన్నట్లు -

మూర్తి:- చాల్లెద్దురూ! వూళ్ళో ఉన్న అశేషజనం శ్రద్ధానందఘాటుకి సాయంత్రం షికారు వెడతారుగదా! వాళ్ళకిలేని 'అబ్జక్షను' నాకెందుకూ? శ్రద్ధానందఘాటులో కూర్చోకూడదా - శర్మగారి లెక్చరు చెవినిపడకూడదని శాసనమా - రండి పోదాం -

దుర్గా:- బాగా చెప్పావు!

డా. రావు:- పద అల్లాగయితే - ఇప్పుడు మేముభయులము అక్కడికి బయల్దేరి వెడదామనే మొదట ఇక్కడికి వచ్చాం - పదండి పోదాము -

(తెర)

(సశేషము)



రంగుల ముగ్గుల సంక్రాంతి



సంక్రాంతి హడావుడి

# ప్రకృతి తత్త్వము

శ్రీ వేదము వేంకట కృష్ణశర్మ

—o—

"ఏశక్తిం దగఁజేరి యీ జగములన్
సృష్టించు నా యీశ్వరుం,
డేశక్తిం గనకే, చలింపఁ గుశలుం
డే మాత్రముం గాఁడతం,
డేశక్తిన్ శివకేశవాబ్జముఖు లెం
తే భక్తి సేవింతు, రా
యీశాని, న్నిను మ్రొక్కఁ జేర్కొనఁగ నే
నెట్లర్హుఁడరి, బాపుఁడన్"

శ్రీ శంకర భగవత్పాదుల సౌందర్యలహరిలోని మొదటి శ్లోకానికి ఇది నా ఆంధ్రానువాదం. శ్రీ జగద్గురువు ప్రకృతినెల్ల శక్తిరూపముగా భావించి చెప్పిన పై పద్యంలోనే వారు బ్రహ్మచే సృష్టింపబడ్డదియు మనకు దృగ్గోచరమగుచుండు నదియు అగు వస్తుజాతముతో గూడిన యీ విశ్వమంతా ప్రకృతిగా నిరూపించినారు. అంతేకాదు ; భగవంతుని సృష్టిస్థితిలయములకు ప్రకృతిస్వరూప అయిన శక్తియే కారణమన్నారు. ఆ శక్తియే లేనిచో - "అతండు" - (ఈశ్వరుఁడు) చలించుటకుగూడ శక్తుడు గాడట! కావుననే బ్రహ్మవిష్ణుమహేశ్వరుల రూపములు దాల్చ సమర్థుడగు ఆ పరమేశ్వరుడే శక్తికి వశవర్తియై, తన కార్యములు నెరవేర్చుకొనుచున్నాడు.

ఆర్షమతానుసారము, ఆ శక్తి పంచభూతములలోను లీనమయి యుండుట చేతనే అవి కడచిన యుగాలలో ఆరాధనీయములయినవి. ఇంద్రుడు, వరుణుడు, వాయుదేవుడు, అగ్నిహోత్రుడు మున్నగువారు, తత్తద్భూతాధిదైవతములుగ ఋషులచే పేర్కొనబడిరి. అట్టి దైవతములనుగూర్చి వారు యజ్ఞ, యాగ, భూతబల్యాదులు సమర్పించుచుండిరి. ఆ యా రూపములతో ప్రపంచమున వర్తించు ప్రకృతి మహాత్వమును గుర్తించిన మహర్షులు వానికెల్ల నధిదైవతమగు శక్తిని వేనోళ్ల గీర్తించిరి.

వారి దృష్టిలో ప్రకృతి కేవలము జడస్వభావగాదు. హాని పుట్టువువలెనే అభివృద్ధియు, అంత్యదశయు గలది. ఆ హేతువుచే ప్రకృతి వికృతిరూపగ పరిణమించుట సుసాధ్యమని తెలిసికొని వాని పుట్టుకకు కారణమైన పరమేశ్వరుడే స్థితిలయములకును కర్తయని నిర్ణయించిరి. ఇట్లు భగవంతుడు కర్తయు ప్రకృతి కారణయు నగుచున్నది. ఆ యా కార్యములపట్ల పరమేశ్వరుఁడు సత్త్వ రజ స్త మో గుణయుతుఁడు కానిచో, ఆ సృష్టిస్థితిలయములు జరగుట దుర్లభము. - కావున నతఁడు ఆ గుణత్రయమునకుఁ గర్త్రిణిగ - మరల

ప్రకృతినే ఆశ్రయింపవలెను. భగవత్కార్యకారణసాధనమే శక్తి. దానిని ప్రకృతియనుఁడు ; సృష్టియనుఁడు ; పరాశక్తి రూపమనుఁడు. ఏమన్నను, గార్యకారణరూపముల కాధారము-పురుషుఁడు-ప్రకృతి యీ రెండేయనుట నిర్వివాదాంశము. ఈ ప్రకృతియే శక్తిరూపమునఁ బురుషునికిఁ జైతన్యము గలిగించుచున్నది.

దీనినే విష్ణుమాయ యని, దేవీస్వరూపమని వేదాంతులందురు. దీనికి సృష్టికర్త భగవంతుఁడే యయినను, అతఁడును ఒక్కొక్కప్పుడు దీని వశమున వర్తింపక తప్పించుకొనుటకు వీలుకాదు. ప్రకృత్యతీతమయిన దుష్టశిక్షణ, శిష్టపోషణ, - ధర్మసంస్థాపనార్థము పరమేశ్వరుఁడు మర్త్యలోకమున కవతరించినపుడు, ఆశక్తికి అనఁగా ప్రకృతికి లొంగియే చరింపవసిల యున్నది. అతని కందువలననే జననమరణాదులు సంభవించుచుండును.

ప్రకృతికి జననమరణాదులు. స్వభావసిద్ధములగు లక్షణములు. విశ్వమున పుట్టుకయు, అభివృద్ధియు, మృత్యువును గల ప్రతి పదార్థమును ఆశక్తియంశ గలవియే కావుననే శక్త్యాశ్రయములయిన వెల్ల మానవులకుఁ బూజనీయములయినవి.

నిర్గుణుడగు భగవంతుని సగుణునిగ మనవారు నిర్ణయించుటలో ఎంతో నిశితమతి నుపయోగించిరి. గుణత్రయము నవలంబించిన పరమేశ్వరుడు సయితము దమవలెనే యుండునని యూహించుకొని, అతనికి సంసారపుఁ దగులాటములను అంటఁగట్టిరి. ఏతత్ఫలితముగ సృష్టిస్థితిలయము లొనర్చు నావిరాడ్రూపుని త్రిమూర్తిత్వమునకు, అనఁగా బ్రహ్మవిష్ణుమహేశ్వరస్థితులకుఁ బ్రకృతినిగూడ లంకెపెట్టి సరస్వతీ లక్ష్మీ పార్వతులు అను గృహిణులను గల్పించిరి. నిజమునకు ఈ ముప్వురు వారి కార్యమునకు సాధనాధి దేవతలుగాని, భార్యలుగారు.

బ్రహ్మ సృష్టికర్తగదా! క్రొత్తగ నేదేని కల్పింపఁదలచుకొన్నవానికి విజ్ఞానము ఉండవలెనుగదా! విద్య లేనిది విజ్ఞానము లభింపదుగదా! కావుననే విద్యాధిదైవతమగు సరస్వతిని అతని గృహిణి యనిరి. కాని, యాతని నిర్మాణచాతుర్యమున కామె సాధనము.

స్థితిఁ పోషణ రక్షణ కృషికి కారణభూతుఁడగు విష్ణుమూర్తి పోషణకృతికి భాగ్యాధిదైవతమగు 'ఇందిర' అతనికి సాధనముగాని పత్ని యనుట పామరుల విశ్వాసమును బలపఱచుటకని యూహింపవలెను. ఈ హేతువుచేతనే ఎట్టిసంపదలనేని శ్రీ స్వరూపముగ మనవారారాధింతురు. ధాన్యలక్ష్మి, ధనలక్ష్మి గృహలక్ష్మి, గజలక్ష్మి, రాజ్యలక్ష్మి ఇత్యాదులీపట్టున అనుసంధించుకొనునది.

ఇఁక ప్రళయకారకుఁడగు ఈశ్వరుని సాధనము శక్తి. అతనికి వృషభవాహనమయిన ఇమ్మహాశక్తికి సింహము వాహనము. ఇరువురు శూలహస్తులే విశేషించి ఆమెకు కోఱలు. ఎఱ్ఱని చింతనిప్పులుమియు కన్నులు దర్శనమాత్రముననే భీతిగొలుపు రూపము - ఇత్యాదులు గలుగుటంబట్టి శివుని కంటెను ముందుగ సంహారకార్యమునకు బూనెడు స్వభావము గలదిగ - ముఖ్యముగ వామాచారులు ఊహించి కొలుతురు. ఇట్టి దుర్గ, కాళి దాక్షాయణినే చిచ్ఛక్తి, విష్ణుమాయ, ప్రకృతిరూపిణి యని పేర్కొని యర్చింతురు.

విరాడ్మూర్తిపుఁడు ఆయా కార్యముల లొనర్పఁ త్రిమూర్తి రూపము ధరించునట్లు- శక్తియు భారతీ భార్గవీ పార్వతీ రూపములను దాల్చి తమకు హృదయాధినాయకమగు మూర్తిత్రయమునకుఁ దోడ్పడును.

అవతారములు ధరించు పరమేశ్వరునకు సాధనమున్నగాని తన పని నిర్వహింప లేఁడు గనుక, ఈ సతీరూపశక్తియు అవతరింపక తప్పదు. శ్రీకృష్ణావతారమున శక్తియగు లక్ష్మి రుక్మిణి యయ్యెను. శ్రీరామునకు సీతయు నట్టిదే. ఈ త్రిమూర్తులు నెఱవేర్పఁదగు గొప్ప కార్యములు భూలోకమున మిక్కుటమయినపుడు మహేంద్రాది దిక్పాలకులు తక్కిన దేవతలుగూడ తమ తమ అంశములతోఁ బుట్టి వారి కార్యములకుఁ దోడ్పడుచు, ధర్మసంస్థాపనము చేయుచుండిరి.

శక్తిస్వరూపిణి యగు స్త్రీ మూలముననే ప్రపంచమున బాగోగులు ప్రబలుచుండుట ఈ నాటికిని జరుగుచుండుట ఎల్లరకును ప్రత్యక్షానుభవమే.

కృతౌతు రేణుకా శక్తిః త్రేతాయాం జనకనందినీ
ద్వాపరే ద్రౌపదీ శక్తిః కలౌ శక్తిః గృహే గృహే

అను శ్లోకభావము పరిశీలింతుమేని - స్త్రీ శక్తిరూపిణియనుట ఎంతవరకు సత్యసమ్మతమో యేర్పడగలదు.

కార్తవీర్యుని కొడుకులు జమదగ్నిని వధించిరి. అపుడు రేణుకాదేవి అంగలార్చుచు ఇరువదియొక్క పర్యాయములు గుండెలు బాదుకొనెను. దాని నెటకో పోయి ఆశ్రమమును చేరవచ్చు పరశురాముఁడాలించెను. తుదకు అతడు క్షత్రియకుల నిర్మూలనము చేయ దండయాత్రలకు వెడలుటకు ఆ యిరువదియొక్క అంకెయే గురి యయ్యెను.

అరువదివేలేండ్ల వృద్ధుడయిన తనపతి ప్రాణముల కెసరుపెట్టి, సీతారామలక్ష్మణుల వనవాసమునకు కారకురాలయిన

కైక వృత్తముచేత రామాయణ మంతటి మహాకావ్యము ఉద్భవించెను.

రావణాది రాక్షసవంశ వినాశనమునకు సీతాదేవియే మూలము. "సీత పుట్టి - లంక చెడె" - అను సామెత త్రేతాయుగ శక్తియగు జానకి జన్మింపకున్న సార్థక మయ్యేడిది కాదు.

ద్వాపరమున జరిగిన కౌరవపాండవ కురుక్షేత్ర ఘోరసంగ్రామమునకు హేతుభూతురాలు పాంచాలి యని యెవ రెఱుగరు. - ఆ ద్వాపరముననే - దేవకీ గర్భమున బుట్టిన శ్రీకృష్ణుడు, జన్మింపగనే 'విష్ణుశక్తి సంబంధమగు తన 'మాయ'ను మేనమామ యగు కంసునికి ప్రత్యక్షముగా ప్రదర్శింపించెను. మాయాతత్వరహస్యజ్ఞుడగు ఆ కృష్ణుడే, సత్యభామ మాయావాగుర చిక్కుకొనుట వింతలలో వింత. ఆమె కాలితాపుకూడ అతడు సహించి దాసోహమన్నాడు. ఇంతెందుకు? పారిజాతమునకై ఇంద్రునితో పోరాడుటకయిన సిద్ధపడినాడు. ఈరగడకు కారణ మెవరు? సత్యభామ యని చెప్పక తప్పదు.

పౌరాణిక యుగమున మాయాస్వరూపులగు అబలలు కావించిన ఘనకార్యములట్లు, - చారిత్రక యుగములోను పెక్కురు కాంతుల సామాన్య విప్లవములు కూర్చిన వారు లేకపోలేదు. ఝాన్సి లక్ష్మిబాయి పుట్టకుండియుండిన సిపాయీల కలహామే యుండియుండదేమో. నాయకురాలి కుతంత్రములతో పల్నాటిసీమ యెట్లు బగ్గముపాడయ్యెనో తెలుగువారి కెల్ల తేటతెల్లమయినదే. విండ్సర్ ప్రభువు (ఎనిమిదవ యెడ్వర్డు) సింహాసన భ్రష్టుడగుటకు సామాన్యనారియే కదా కారణము.

విద్యలలో అంతగా చొరవలేని శివాజీ రాజ్యాంగవేత్త యగుటకును, స్వధర్మనిష్ఠుడగుటకును, తగిన తరబీతును తల్లి యగు జిజియాబాయి ఇచ్చినందుననే కదా! - ఆ శక్తి స్వరూప బలమున మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపకుడై, ఢిల్లీ సుల్తానులకు గుండెగాలమయ్యెను.

(సశేషము)

## సంసారాలు సంతోషప్రదం చేయడం ప్రణాళిక ఆశయం

తెలివిగా సంసారాన్ని సరిదిద్దుకొనడ మంటే కుటుంబ సౌఖ్యానికీ, దేశ సౌభాగ్యానికీ పాటుపడటమే —

- ఆహార పదార్థాలు మొదలైనవి దుబారా చేయకండి.
- పెరటి తోట పెంచుకోండి - బజారులో కూరలు దొరకడం లేదనే బాధ ఉండదు.
- ఏదో కొంటున్నామనే భావంతో ఏ వస్తువూ కొనకండి.
- తీరిక సమయాలలో అల్లిక, కుట్టుపనివంటి వ్యాపృత్తి పెట్టుకోండి.
- కుటుంబ నియంత్రణం అవలంబిస్తే, మీ సంసారం ఎంతో సుఖంగా ఉంటుంది.
- మీ పిల్లలు రేపటి ఉత్తమ పౌరులుగా తయారయ్యేందుకు మీరే తగు శిక్షణ నివ్వాలి.
- ఎక్కువగా పొదుపుచేసి, భారత ప్రభుత్వంవారి చిన్న మొత్తాల పొదుపు పథకంలో మదుపు పెట్టండి.

## ప్రణాళికకు సహకార మివ్వండి. మీ మేలుకు మీరు కృషి చేయండి



# అసూయ?

'అరుంధతి'

—X—

ఆ రోజంతా మా ఆవిడ కాస్త చీకాకుగానే వుంది. నా యెదుట పడినప్పుడల్లా నా ముఖంలోకి అనుమానంగానే చూచేది. ఆ రాత్రి విస్తరిముందు కూర్చున్న పది నిమిషాలు దాని దృష్టి అంతా నా మీదే వుంది. ఎప్పుడూ నాతోకూడ భోజనానికి కూర్చునేది ఆ వేళ నా ఒక్కడికి పెట్టింది. నా భోజనమైన తర్వాత అది భోజనంచేసి, అంతా సర్దుకుని వంటింట్లో దీపాలు ఆర్పేటప్పటికి పదిన్నర అయింది. నేనూ పేపరు చదువుకుంటూ కూర్చున్నా నన్న మాటేకాని ఆలోచనంతా దీన్నిగురించే! ఆనాటి మా ఆవిడ వింతప్రవర్తన నాకేమీ అర్థం కాలేదు. నా ఆలోచనలకు అంతంలేదు. సమస్య మాత్రం తీరలేదు. నాకు పక్కవేసి తాను గృహలక్ష్మి పుచ్చుకుని కూర్చుంది. సాయంకాలం ఆఫీసు నుండి వచ్చేటప్పుడు పట్టుకొచ్చిన మల్లెపూలు అలాగే వున్నాయి టేబిలుమీద. రేడియో కూడ పెట్టలేదు. నాకు పిచ్చెత్తినట్లైంది. పేపరు మూసేసి దానివైపే చూస్తూకూర్చున్నాను పది నిముషాలు. అబ్బే! అది మాత్రం కదలలేదు. తెల్లవారితే ప్రయాణం. ఏమిటిది? ఇంకా యేమీ సర్దుకోలేదు. అయినా నాకుమాత్రం ఒళ్లు మండి యింది. కాని చేసేదేమిటి? ఆడవాళ్లు ఆ పరిస్థితుల్లో వున్నప్పుడు మొగాడు యేమాత్రం కోపగించు న్నా ఆశించిన ఫలితం దక్కకపోగా - మనకే యెదురు తిరిగి రసాభాస అవుతుందని ఒకసారి మా ఆవిడే అంది. అయితే యెంత సేపని యీ ఎడముఖం - పెడముఖం! "నిర్మలా!" అంటూ నెమ్మదిగా పిలిచాను. అది వినిపించుకోలేదు - మళ్ళీ పిలిచాను. "ఏం?" అంటూ చేతిలోని పుస్తకం ప్రక్కన పెట్టి అనుమానంగా చూచింది. "మాట యిల్లారా!" అన్నాను నవ్వుతూ. 'చెప్పండి యేమిటో' విసుగ్గా అంది. "యిలారా చెప్తాను" నవ్వుతూనే అన్నాను. వచ్చి ప్రక్కన నిలబడి 'ఏం?' అంది

"ఇలా కూర్చో," అన్నాను దాని ముఖంలోకి చూస్తూ. ప్రక్కనే కూర్చుని తలవంచుకుంది. "ఏం అలాగున్నావు యీవాళ?" నెమ్మదిగా అడిగాను.

"ఏమీలేదు" ముక్తసరిగా సమాధానమిచ్చింది

"మల్లెపూలు పెట్టుకోలేదేం?"

"ఏమీలేదు"

"అంటే?"

"అంటే -యేమీలేదు"

"ఎందుకు అంతకోపం?"

"ఎవరికి కోపం?"

"నీకు..."

"నాకేం కోపంలేదు."

"అయితే యెందుకలా నున్నావు?"

"ఏమీలేదు... కాని నేనొక విషయం అడుగుతాను నిజం చెప్తారా?" అంటూ నా కళ్లలోకి పరీక్షగా చూచింది. "నాకు తెల్సింటే..." అని నవ్వాను. నా నవ్వుకు దానికి ఒళ్లు మండుకుపోయింది,

"అయితే మీ పర్సులోని ఫొటో యెవరిది?"

అటంబాంబు పడ్డంత పనైంది. ఏం సమాధానమివ్వాలో అర్థంకాలేదు. నిజం చెప్పినా కాని యిటువంటి విషయాల్లో ఆడవాళ్లు నమ్మరు. వాళ్లను నమ్మించడం బ్రహ్మతరం కాదు. ఒకవేళ నమ్మినట్లు నటించినా - జీవిత పర్యంతం అనుమానం పీడిస్తూనే వుంటుంది. నిజంగా ఆ ఫొటో యెప్పుడో యెక్కడో దొరికింది. దాన్ని చూడ్డంతోనే ఆ కళ్లలో యేదో ఆకర్షణ కన్పించింది, అవతల పారెయ్యలేక మనీ పర్సులో పెట్టాను. అంతే ఆ ఫొటో చరిత్ర. అయితే ఆఫొటో పర్సులో వుందన్న సంగతే మరచిపోయాను. లేకపోతే యెప్పుడో తీసివేశేవాణ్ణి. నా పెళ్ళిముందు దొరికిన ఫొటో అది. అయినా యిప్పుడైనా తీసేద్దామంటే మనసొప్పదు! నాకు నవ్వొచ్చింది. "అదెవరో ఫొటో ఎక్కడో దొరికింది. ముఖం కళగావుంది. పారెయ్యడమెందుకని అందులో పడేశాను." అన్నాను నెమ్మదిగ.

"దాని ముఖం అంత కళగా వుంటే నాలాంటి కురూపిని యెందుకు చేసుకున్నారు?" అంటూ తీక్షణంగా చూచింది. "అదేమిటే!" అన్నాను వెర్రిగా.

"అదే నేనూ అడుగుతున్నాను - పర్సులో పెట్టుకుని తిరిగేటంత కళగావుంటే నన్నెందుకు చేసుకున్నారని."

"అదికాదే- నిజంగా ఆ ఫోటో దొరికింది..."

"చాల్లెండి! ఇటువంటి ఫోటోలు దొరికాయంటే యెవ్వరూ నమ్మరు. ఇంకా దాస్తారెందుకు? అబద్ధమాడినా నమ్మేలాగవుండాలి."

"అబద్ధం కాదే - నిజం"

"మీరు లక్షచెప్పండి నేను నమ్మలేను." నాకు ఒకవైపు కోపం, ఒకవైపు నవ్వుకూడ వస్తోంది. ఏం సమాధానం చెప్పాలో అర్థంకాలేదు. అలాగే వెర్రిగా చూస్తూ కూర్చున్నాను. నేను గట్టిగా సమాధానం చెప్పకపోవడం దాని అనుమానాన్ని మరింత బలపరచింది. మౌనం అర్ధాంగీకారమన్నట్లు వెంటనే అందుకుంది—

"నేను యీ వూరు వచ్చినప్పటినుండి చూస్తున్నాను-మీ వ్యవహారమూ మీ ప్రవర్తనను—నన్ను మీతో సినిమాకు తీసుకువెళ్ళటం సిగ్గు. బజారుకు తీసుకువెళ్ళాలంటే అనుమానం, కలిసి పార్కుకు వెడదామంటే స్నేహితులు చూచి నవ్వుతారని భయం. నిజం చెప్పండి — ఒక్కసారైనా నన్ను మీతో యెక్కడికైనా తీసుకు వెళ్లారా? నేను వచ్చిన తర్వాత యీ ఆరు నెలల్లోను వెళ్ళిన నాలుగు సినిమాలకు రెండో ఆటకు తీసుకువెళ్ళారు యెవ్వరూ చూడరు కదా అని. ఆదివారంనాడు పార్కుకు పక్కింటి ఆవిడతో వెళ్ళమనేవారు. నేను అంత అంద వికారంగా వున్నప్పుడు అవిణ్నే చేసుకోలేక పోయారా! ... ఇప్పుడైతేయేం? మించిపోయిందేమీ లేదులెండి. నేనూ మా పుట్టింటికి పోతాను, అవిణ్నే తెచ్చుకుని యింట్లో పెట్టుకోండి. నాబాధ మీకెందుకు? ఇద్దరూ జట్టాపట్టా వేసుకుని ఊరేగవచ్చు"

"నిర్మలా! ఒకసారి చెప్తే వినాలి, గ్రహించాలి. మాటమీద నమ్మకముండాలి. ఏమిటిదంతా పిచ్చిదానిలాగ..."

"అవును. పిచ్చిదాన్ని చేసే యిన్నాళ్లు యిలా మీ యిష్టమొచ్చినట్లు చేస్తున్నారు."

"అయితే నా మాటమీద నమ్మకంలేదా?"

"ఉండబట్టే యింతవరకు వచ్చింది." అంటూ తెచ్చిపెట్టుకున్న నవ్వుతో నా ముఖంలోకి చూచింది. ఆ నవ్వు వెనకాలే అసూయ, అపహాస్యం, యేదో బాధ స్పష్టంగా కన్పిస్తున్నాయి. నేనేమీ మాట్లాడలేదు. "ఏమండి! ఆ అమ్మాయి పేరేమిటి?" అంది నవ్వుతూ. "నాకు తెలీదే - అసలు ఆ పిల్ల యెవరో కూడ నాకు తెలీదు."

"మీకు తెలియదంటే నేనొప్పుకోను కాని—పోనీ మీరిద్దరూ కలిసి యెన్ని సినిమాలకు వెళ్లారు చెప్పండి!"

"నిజమేనే నేనెప్పుడూ చూడలేదు ఆ పిల్లను."

"సరేలెండి మీతో వాదన యెందుకు..." అంటూ పెట్టె సర్దటం మొదలుపెట్టింది.

ఆ మరునాడే రాజమండ్రి చేరాం. భోజనంచేసి కాస్సేపు పడుక్కుందామని నడ్డి వాల్చాను. చెల్లెళ్ళిద్దరూ డబ్బుకోసమని పర్సుతీశారు. "ఒదినా యీ ఫోటో యెవరిదమ్మా!" అన్నారు. నాగుండెలు ఆగిపోయాయి. హైదరాబాదునుండి బయల్దేరేటప్పుడే ఆ ఫోటో తీసేద్దామనుకున్నాను. మా ఆవిడకు కూడ చాల చీకాకు వేసింది. రెట్టించి అడిగేసరికి, "నాకు తెలీదు. మీ అన్నయ్యనడగండి" అంది విసుగ్గా.

తెల్లవారుఝామున పెళ్ళి రాత్రి భోజనాలయ్యాక మా పెద్ద ఒదిన అడిగింది. "ఏం నిర్మలా! మీ ఆయన పర్సులోవున్న ఫోటో యెవరిది? నే నెవరితోను చెప్పనులే."

"ఏమో నాకు తెలియదండి...అది చాల రోజుల నుండి వుందిట నాకు తెలీదు. నేనూ మొన్న రాత్రి

యిక్కడకు వచ్చేయమందు చూశాను. అప్పుడే అది గాను...యెక్కడో దొరికిందట..."

"దొరికిన ఫొటో పర్సులో యిలా పెట్టుకున్నాడు! అసలు దొరికిందంటే నువ్వెలా నమ్మేవు? ఏమొచ్చిందమ్మా నిక్షేపంలా వుండేవాడు యిక్కడ వున్నప్పుడు..."

నెమ్మదిగా యీ వార్త అందరి చెవుల్లోను పడింది అయినా నన్ను మాత్రం యెవ్వరూ అడగలేదు. ఇక అక్కడ వుండడం చికాకేసింది. ఆ మరునాటి సాయంకాలమే బయల్దేరి హైదరాబాదు వచ్చేసి పర్సుమాత్రం పెట్లో పడేశాను. అయితే మా ఆవిడకు మాత్రం కోపం తగ్గలేదు. సత్యాగ్రహం మొదలు పెట్టింది. దాని యిష్టమొచ్చినట్లు చెయ్యడం మొదలు పెట్టింది. సాయంకాలం యింటికి వచ్చేసరికి కాసిని టీ నీళ్లు ఫ్లాస్కులో పోసి నిద్రపోయేది. ఒకరోజు రెండు రోజులు. ఆఖరికి విసుగొచ్చింది. "ఏమే! ఏమిటి యిదంతా?" అబ్బే! సమాధానం లేకపోగా మంచం మీదనుండికూడ లేవలేదు. "నిర్మలా! నీ వ్యవహారమేమీ బాగులేదు. ప్రాణాలు పోతూ వస్తుంది యీ జంతువ. కాసిని కాఫీ నీళ్లైనా యిద్దామని లేదేమే!"

"ఫ్లాస్కులోవుంది."

"అంతేనేకాని నువ్వు మాత్రం లేవనంటావు... సరే యేమైనా చేశావా?"

"మీరొచ్చేసరికి అన్నీ సిద్ధంచేసి, రాగానే నోట్లోపెట్టి తినిపించడానికి నాకు ఓపికలేదు. అద వరో మీ నెత్తిమీది దేవతని తెచ్చి యింట్లో పెట్టుకోండి. మీకు కావలసినదల్లా చేసి పెట్టుతుంది." అంటూ లేచి ఫ్లాస్కు గ్లాసు నా ముందర పడేసి చర్రున వంట యింట్లోకి వెళ్లిపోయింది.

నిజంగా నాకు మతిపోయింది, నెమ్మదిగా కాఫీ త్రాగి పెట్లోంచి పర్సు తీశాను. అందులో ఫొటో లేదు. నిర్మల తీసేసిందేమో అనుకుని ఈజీచైరులో కూలబడి ఆలోచిస్తున్నాను. ఎదురుగా క్రొత్త ఫొటో నా కళ్లబడింది, లేచి చూచాను. ఇంకేముంది, పర్సులోని ఫొటో తీసి ఫ్రేము కట్టించింది. పైగా దానికి పూలదండ కూడా వేసింది. నాకు మహా చికాకు వేసింది.

"నిర్మలా! నిర్మలా!" గట్టిగా పిలిచాను. మాట్లాడకుండావచ్చి గది గుమ్మంలో నిలబడింది, దాన్ని చూడగానే మనసు రగుల్కుపోయింది.

"ఏమిటిదంతా? ఏమిటీ ఫొటో!"

"ఏం?"

"ఏమిటిదంతా?" కోపంగా అన్నాను.

"పర్సులో పెట్టుకుని ఊరంతా తిరగ్గాలేంది ఫ్రేము కట్టించి పడక గదిలో పెట్టుకుంటే తప్పొచ్చిందా! ఇలావుంటే యెప్పుడూ కళ్లెదురుగా వుంటుంది. చూస్తూ తీయని కలలు కంటూ పడుకో వచ్చు. రేపే నేను మావాళ్లింటికి వెడుతున్నాను. తర్వాత మీ యిష్టమొచ్చినప్పుడు ఆవిణ్ణి తీసుకొచ్చుకోండి. లేదా మీరే ఆమె వద్దకు వెళ్లి వుండండి. నేను మాత్రం యిక్కడ వుండలేను. వుండను. మీరు బాధపడ్డం, నేను బాధపడ్డం-యెందుకొచ్చింది! మీరు ఆనందంగా వుంటేచాలు అదే నేను కోరేది." అంటూ కన్నీరు కారుస్తూ నా ముఖంలోకి చూసింది.

"నిర్మలా? చెప్పితే వినాలి. లేదా తనకుతోచాలి. రెండూ లేనప్పుడు చాలకష్టం. అయినా యింతవరకు వస్తుందని తోస్తే యెప్పుడో చింపేశేవాణ్ణి" అంటూ గోడనున్న ఫొటో తియ్యబోయాను. చేయిజారి క్రిందపడి ముక్కలైంది. లోపలి ఫొటో తీసి నాలుగు ముక్కలు చేశాను.

ఆ రోజు మొదలుకుని యీ పది సంవత్సరాల లోను మళ్లీ ఆ ఫొటో సంగతి మాట్లాడలేదు. తర్వాత యెప్పుడో ఒకసారి నాకు జ్వరం వస్తే నవ్వుతూ అంది. "ఏమండీ! ప్రియురాలి కోసం బెంగపెట్టుకున్నారా? పోనీ చూసిరండి ఒక్కసారి."



# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

**3 ఔన్సుల బుడ్డి రు. 1 – 25 న.పై.**

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

**3 ఔ॥ రు. 3 – 10    6 ఔ॥ రు. 5 – 50**

## క్షీరబలాతైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

**6 ఔ॥ల బుడ్డి రు. 3 – 0**

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

**బుడ్డి రు. 2 – 0**

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

**బుడ్డి రు. 4 – 0**

## కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు–14.**

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు :

**శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు, బెంగుళూరు**

# సంక్రాంతి

శ్రీ చదలవాడ సోదరీ కవయిత్రులు

—— (౦) ——

పూస గ్రుచ్చునంత ప్రొద్దుండ దిప్పుడు
ఎండయున్నఁ జలి కృశింపకుండు
ఒంటిపూఁటఁ దిండియొదవని బీదలఁ
జూడలేక త్వరగ సూర్యుఁడరుగు
తగుదునంచు రాజున్నత స్థలికి రాఁగ
ఆఁకటన్ గ్రుగ్గు బీదవారార్తపడుచు
నూలు ప్రోఁగు లొసంగి కానుకలుగాఁగ
"కూడు గుడ్డల మా గోడు చూడు" మంద్రు
"మాట - మంతిమాను మండలేశ్వరుతోడ
ఎంత మొత్తుకొన్న నేమిఫలము!
ప్రొద్దు పుత్తు మెటులో యొద్దికతో"నని
పేదవారు కనులు విప్పకుంద్రు
లోక బాంధవునకుఁ గృపరాకయున్నె!
తీఱదా కొ! దారిద్ర్యాంధకారమింక
ఈశ్వరునకుఁ దోడ్పడుచు ధనేశ్వరుండు
పలుపకుండునె! తన సుహృద్భావ మిపుడు
ఎన్ని సంక్రాంతు లీరీతి నేగుదెంచి
అరిగెనో! వాని గణియింప ననవసరము
నేఁటి సంక్రాంతియైన నీనాఁటి బీద
వారలం బ్రోవఁగాఁ బాటుపడునో! లేదా!

# చిదంబర రహస్యం



నేనొక సివిల్ ఇంజనీర్ని. మా నాన్నగారు ఏదో సామాన్య గుమాస్తా ఉద్యోగం చేస్తూండేవారు. బోలెడంత ఖర్చయిన నా ఇంజనీరింగు విద్యకు మా నాన్నగారు డబ్బు ఎక్కడనుంచి ఎలా తెచ్చేవారో నాకో చిదంబర రహస్యంగానే ఉండేది. సరిగ్గా అయిదేళ్ల క్రితం ఒకనాడు నా మొట్టమొదటి జీతపు చెక్కు నేను ఇంటికి తెచ్చాను. అప్పుడు నాన్నగారు చెప్పారు కీలక మేమిటో! అంత క్రితం ఎప్పుడో ఆయన అమ్మ నగలన్నీ అమ్మేసి, ఆ డబ్బుతో జాతీయ పొదుపు సర్టిఫికెట్లు కొని దాచారట. అంతే కాకుండా అంతలో కొంత నిత్యమూ పొదుపు చేసి, ఈ సర్టిఫికెట్లలో పెట్టుబడి పెట్టేవారట. నేను కూడా అలాగే పొదుపు చేయాలని ఆయన ఆనాడు నాకు చేసిన హితబోధ విని ఆ ప్రకారం ఆచరించినందుకు ఈనాడు నేనెంతో సంతోషిస్తున్నాను. విదేశాలకు వెళ్లి ఉన్నత విద్య అభ్యసించడానికి చాలినంత సొమ్ము కూడింది నా దగ్గర ఇప్పుడు!

*ప్రభుత్వం జారీచేసే జాతీయ ప్రణాళిక పొదుపు సర్టిఫికేట్లు మొదలైన చిన్న మొత్తాల పొదుపు పథకం తాలూకు ఇతర హామీ పత్రాలలోనూ పెట్టుబడి పెట్టిన డబ్బు పువ్వుల్లో పెట్టినట్లు మీకు వడ్డీతో సహా తిరిగి వస్తుంది. ఈ విధంగా లభించే వడ్డీలపై పన్నులు కూడా విధించరు. అందుమూలంగా భవిష్యత్తులో మీ సుఖం మీరు చూసుకొనడమే కాక, జాతి భవిష్యత్తును రూపుదిద్దగల పునర్నిర్మాణ కార్యకలాపాలకు కావలసిన ధనం సమకూర్చినవారవుతారు.*

12-ఏళ్ల
జాతీయ ప్రణాళిక పొదుపు సర్టిఫికేట్లు

- పన్ను లేకుండా సాలీనా 5.41% వడ్డీ పడుతుంది;
- రు. 5, 10, 50, 100, 500, 1000, 5000ల విలువల్లో అన్ని పోస్టాఫీసులలోనూ సులువుగా లభ్యమవుతాయి.
- భారత ప్రభుత్వం వారి హామీ ఉన్న పొదుపు పత్రాలు.

చిన్న మొత్తాల పొదుపు పథకంక్రింద లభ్యమయ్యే ప్రభుత్వంవారి ఇతర హామీ పత్రాలు:

10-ఏళ్ల
ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు
పోస్టు ఆఫీసు సేవింగ్సు బ్యాంక్ డిపాజిట్లు






## జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

ఈ పథకం గూర్చిన షరతులు, ఇతర వివరాలు నాగపూరులోని నేషనల్ సేవింగ్సు కమీషనరుయొద్దగాని, మీ రాష్ట్రంలోని రీజినల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసరునుండిగాని పొందవచ్చును.

# అమెరికన్ మహిళ



అమెరికాలో మాజీ ఇండియా రాయబారి జి. ఎల్. మెహతా "అమెరికాలో సామాన్య పౌరుడు" గురించి ఇటీవల ప్రసంగిస్తూ, సామాన్య అమెరికన్ మహిళను గురించి కూడా ప్రస్తావించడం మరచిపోలేదు. ఆయన ప్రతిభా పూర్వక రాజకీయ చతురుడు మాత్రమే కాక, సూక్ష్మ పరిశీలనా పాటవం కలవారని కూడా చెప్పడానికి ఇది నిదర్శనం. ఎందుకంటే, స్త్రీలను గురించి ప్రస్తావించకుండా వదలివేస్తే వారికి కోపం వస్తుంది. తమరిని ఎవరూ మరచిపోకుండా జ్ఞాపకం పెట్టుకోవాలని ప్రపంచంలో సర్వత్రా స్త్రీలకు ఉండే అభిలాష. అందరిలాగే అమెరికన్ స్త్రీలు కూడా! "కుటుంబంలో తల్లికి అగ్రస్థానం ఇవ్వాలనీ, సమాజానికి స్త్రీ జీవగర్ర అనీ అమెరికాలో అందరికీ గ్రహింపు ఉన్నది" అని అమెరికన్ మహిళలను గురించి మెహతాకు ఏర్పడిన అభిప్రాయం.

విమర్శకుల దృక్పథాలనుబట్టి వారికి అమెరికన్ మహిళలను గురించి ఏ అభిప్రాయమైనా ఏర్పడవచ్చు. ఆటువంటి అభిప్రాయాలలో కొన్ని ఇవి:

"అమెరికన్ మహిళకు సమాజంలో విశిష్టస్థానం ఉన్నది"_"ఆమెను అత్యున్నత స్థానంలో కూర్చోబెట్టారు"_"అన్నింటిలో ఉత్తమమైనవన్నీ ఆమెకే దక్కుతాయి"_ఇలాగ కాక ఇంకా తీవ్రంగా విమర్శించినవారు "అమెరికన్ మహిళ చెడిపోతున్నది" అని అన్నారు. విదేశ పరిశీలకులు ఈ విధంగా వర్ణించడంలో మొత్తంమీద వారి అభిప్రాయం ఇది:

"అమెరికన్ మహిళకు అంతులేనంత స్వేచ్ఛ ఉన్నది; ఆమె ఏ పని చేసుకోడానికైనా సరే, ఒంటరిగా ప్రయాణం చేసుకోడానికైనా సరే, సొంతంగా కారు నడుపుకొని వెళ్లడానికైనా సరే, కుటుంబధనాన్ని ఖర్చు చేయడానికైనా సరే స్వేచ్ఛ ఉన్నది; ఆమె ఎటువంటి సంఘాన్నయినా సరే నడుపుకోవచ్చు; ఇంచుమించు ఏ రంగంలోనైనా సరే పురుషులతో సమానంగా పోటీ చేయడానికి ఆమెకు స్వేచ్ఛకలదు."

అమెరికన్ మహిళను గురించి ఎవరు ఎటువంటి అభిప్రాయం పడినాసరే నిజమే అవుతుంది.

ఎందుకంటే, అమెరికన్ సమాజంలో స్త్రీకి అమోఘమైన స్వేచ్ఛ ఉన్నది; వారు ఇంచుమించు ప్రతి రంగంలోనూ పురుషులతో పోటీ చేస్తున్నారు.

ఇదంతా ఎలాగ జరిగింది?

అమెరికన్ సమాజంలో ఉన్న ఇంచుమించు అన్ని విషయాలలాగే, దానికి కూడా చాలావరకు దాని చరిత్ర కారణం.

ఆదిలో అమెరికా అంటే కొద్ది కాలనీలు తప్ప మరేవీ లేనప్పుడు, దుర్గమారణ్య ప్రాంతాలలో భావి జీవితం ఎలావుంటుందో తెలియని ఆ దేశానికి యూరప్‌నుంచి అతి సాహసోపేతులైన పురుషులు వెళ్లారంటే, వారితోపాటు వెళ్లిన స్త్రీలు ఇంకెంత వారో వర్ణనాతీతంగద.

ఇంతకంటేకూడా ముఖ్యమైన దేమిటంటే అప్పట్లో ఉన్న పరిస్థితులలో తాము స్వయం పోషకంగాను, స్వేచ్ఛగాను ఉండాలని వారిలో ప్రగాఢ వాంఛ ఏర్పడింది.

ఎన్ని చెప్పినప్పటికీ స్త్రీ ఇంటిలో ఉండవలసిందే నన్నమాట నిజం. ఆమె గృహిణిగా ఉండడం మాత్రమే కాక, కుటుంబ సౌఖ్యానికి కూడా పాటుపడవలసి ఉన్నది. అందుచేత ఆ రోజులలో అమెరికన్ పురుషుడు అడవులుకొట్టి నేలను సాగుచేస్తూ ఉంటే అతడి భార్య బట్టలు కుట్టటం, కొవ్వొత్తులు తయారు చేయడం, సబ్బులు తయారు చేయడం మొదలైన పనులు చేసేది. అతడు ఇంటిలో లేనప్పుడు పశువులకు మేత వేసేది. పొలాలనుగానీ, తమ కోటనుగానీ కాపాడుకోడానికి అతడు మొరటు అడివి మనుష్యులతో యుద్ధం చేయవలసివచ్చినప్పుడు తుపాకి తూటాలు అందిస్తూ సాయపడేది; అతడు

ఆ యుద్ధంలో మరణిస్తే తనే తుపాకి పట్టి రణరంగంలోకి దూకేది.

కాలనీల రోజులలో స్త్రీలు ధైర్యసాహసోపేతులు మాత్రమేకాక, వారి సంఖ్య కూడా చాలా తక్కువగా ఉండేది. మొట్టమొదట్లో కొద్దిమంది అవివాహితలు మాత్రమే అమెరికాకు వచ్చారు. ఇది వారికి అదృష్టంగా పరిణమించినది. ఎందుకంటే వారి సంఖ్య తక్కువగా ఉండడంచేత, వారిమాట బాగా చెల్లుబడి అయేది. యూరప్‌లో అయితే వారు ఎవరిని వివాహమాడాలో తల్లితండ్రులు నిర్ణయించి వుండేవారు. ఇక్కడ కూడా తల్లిదండ్రులు ఆదేవిధంగా చెయ్యాలని చూచేవారుగాని, అనతి కాలంలోనే వివాహపద్ధతి పూర్తిగా మారిపోయి, స్త్రీ తన భర్తను తానే నిర్ణయించుకొనే స్వేచ్ఛ లభించింది. వివాహం చేసుకోదలచిన పురుషులు చాలమంది ఉండడంచేత ఆమె తనకు నచ్చినవానిని ఏరుకొనేది.

ఇప్పటికీ అలాగే జరుగుతూ ఉన్నది.

కాని, తనకు తగిన భర్తను గురించి అమెరికన్ యువతి తన తల్లిదండ్రులను ఎప్పుడూ సలహా చెయ్యదని కాదు. అప్పుడు, ఇప్పుడు కూడా తల్లిదండ్రుల సలహా తీసుకొనడం జరుగుతూనే ఉన్నది. దానిలో ముఖ్యవిషయమేమిటంటే, అది సలహామాత్రమే; వారి ఆజ్ఞ ఏమీ ఉండదు. తనకు నచ్చినవానిని మాత్రమే వివాహం చేసుకొంటుంది.

అమెరికాలో విడాకులను గురించి ఎంత చెప్పుకొన్నప్పటికీ—క్రిందటి సంవత్సరం అమెరికాలో విడాకులు పుచ్చుకొన్న స్త్రీలు నూటికి 2.3 వంతుల మంది. వివాహంలో స్త్రీ ఇష్టమొచ్చినట్లు జరగవలసిందే. యూరప్‌లో అవివాహితులు ఇంటిలో కుమార్తెలుగా ఎంతకాలం వుండిపోయినా ఎవరూ పటించుకోరు కాని. అమెరికాలో అలా కాదు. స్త్రీ వివాహం చేసుకోలేకపోతే తప్పుగా భావిస్తారు.

అమెరికా ఆదిలో ఉన్నట్టుగా, ఇప్పుడు స్త్రీల కొరత లేదు. కాని ఆ నాటినుంచి వస్తున్న సాంప్రదాయం మారలేదు. యూరప్‌లో మహిళలను ఎంత మర్యాదగా చూస్తారో, అమెరికాలో తమరిని కూడా అలాగే చూడాలని వారి వాంఛ. భర్త బరువైన పనులు, కష్టపడి చెయ్యవలసిన పనులు చేయాలి. సంచులు మోయాలి; ఇంటిలో పళ్లాలు అవీ తరచు కడిగిపెడుతూ ఉండాలి.

ఇలా ఉన్నప్పటికీ, పురుషులు చేయగల ఇంచుమించు ప్రతి పనినీ అమెరికన్ స్త్రీ చేయగలదని భావించవలసి ఉన్నది; పెద్ద ఉద్యోగం చేయగలదు; డబ్బు వ్యవహారాలు చూడగలదు; పొలం పనిచేయగలదు; దుకాణం నడపగలదు: కావాలంటే రాజకీయ నాయకురాలు కాగలదు. మొత్తం అమెరికన్ కార్మికులలో ఇంచుమించు మూడవవంతు మంది స్త్రీలే అయినప్పటికీ, ఈ 220 లక్షలమంది కార్మిక మహిళలలో సగంమంది వివాహితులు అయినప్పటికీ, ఆమెకు తన వంటింటిలో ముఖ్యంగా ఆధునిక సామగ్రితో నిండిన వంటింటిలో, పనులు చేసుకొనడమంటేనే చాలా ఇష్టం. ఒక అమెరికన్ గృహిణి ఏదైనా ఉద్యోగం చెయ్యాలని అనుకొంటే, తన భర్త సంపాదనకు తానుకూడా కొంత సహాయపడాలనుకొని మాత్రమే ఉద్యోగం చేస్తుంది. సర్వసామాన్యంగా పిల్లలు పెద్దవాళ్లయ్యేవరకు ఆమె (ఉద్యోగాలలో ఉండే స్త్రీల సగటు వయస్సు 39 సంవత్సరాలు) ఏ ఉద్యోగానికి వెళ్లదు; తరచు ఆమె చేసే ఉద్యోగం రోజుకు కొద్ది గంటలు మాత్రమే చేసేది అయివుంటుంది.

పురుషునితో సమానంగా అమెరికన్ వనిత పోటీచేస్తున్నదా లేదా అనేది ప్రశ్న కాదు. అలాగ పోటీచేయగల స్వేచ్ఛ తన కున్నదనీ, అందుకు తగిన అర్హతలు తనకున్నవని ఆమె ధైర్యం. సగటున చూస్తే పురుషునికంటె స్త్రీలకు ఎక్కువ విద్యాభ్యాసం ఉన్నది. లెక్కల ప్రకారంచూస్తే పురుషుల

కంటే వారు ఎక్కువ కాలం జీవిస్తున్నారు. ఈ నాడు పురుషుల సంఖ్యకంటె వారి సంఖ్య కొంచెం హెచ్చు.

అలంకరించుకొనడమంటే ఇష్టం. అయితే, హాలీవుడ్ చిత్రాలలో కనిపించే అవతారిలాగ అమెరికన్ స్త్రీలు ఉంటారనుకొనడం పొరపాటు. ఆటువంటి



వినోద విహారాలలో పాల్గొను అమెరికన్ మహిళా బృందము

ఇన్ని వున్నప్పటికీ, తన సహజ లక్షణాలమీద అమెరికన్ స్త్రీకి మోజు ఎక్కువ. ఆకర్షణీయంగా, అందంగా కనిపించాలని ఆమె అభిలాష. చక్కగా

చవకబారు షోకులాడులు ఆ ఫిల్ములలో కనిపిస్తారు గాని, సామాన్య అమెరికన్ వనితలలో ఉండరు.

అందుచేత, అమెరికన్ మహిళ, ప్రపంచంలో ఇతర మహిళలవంటిదవునా కాదా?

అవునని చెప్పాలి. ఉత్తమ ప్రపంచ నిర్మాణానికి సహాయ పడాలనే మిగతా మహిళల వంతవారే వారూను. ఇండియాను దర్శించే భాగ్యం లభించిన అమెరికన్ మహిళలు భారత మహిళల రూపలావణ్యాలకు, శక్తి సామర్థ్యాలకు ముగ్ధులవుతూంటారు. ప్రపంచంలోకెల్లా స్త్రీలదుస్తులలో సాటిలేనిదని ప్రఖ్యాతి వహించిన చీరమూనీ వారు మురిసిపోతుంటారు. అమెరికన్ వనిత ఇండియాలో సంచరించినప్పుడు, ఆదిలో అమెరికన్ కాలనీలు అభివృద్ధి చెందే రోజులలో ఎలా ఉండేదో ఆ రోజులను కళ్ళారా చూస్తున్నట్లు అనిపిస్తుంది ఆమెకి. ఎలాగంటే, ఇండియా ఇప్పుడు పరిణామ దశలోవున్నది. అభివృద్ధి కోసం అనేక ప్రయోగాలు, ప్రయత్నాలు జరుగుతున్నవి. ప్రపంచమంతా ఇండియా అభివృద్ధి కోసం ఆత్రతగా ఎదురు చూస్తున్నది. భారత మహిళలు, ఆనాడు అమెరికన్ వనితల లాగ తమ భర్తలతో, సోదరులతో, కుమారులతో కలిసి నవ భారత నిర్మాణానికి ధైర్యసాహసాలతో కృషి చేస్తున్నది.

అందుచేత, ప్రపంచంలో ఇతర మహిళలకంటె అమెరికన్ మహిళలు భిన్నమైనవారా?

ఏమైనా, మనం కనీసం ఒక విషయం చెప్పుకో వలసివుంది; అమెరికన్ సమాజంలో తమ విశిష్ట స్థానాన్ని సంపాదించుకొన్నదని భావించుకోవడం ఆమెకు సరదా. సమాజంలో స్త్రీలు సౌందర్య వర్గంగా ఉన్నవారుగాని, శక్తిహీనులూ, చేతకాని వారూ కాదనే సత్యాన్ని సమాజం గ్రహించినందుకు ఆమె గర్వపడుతుంది. భర్తకు భార్య ఆస్తి వంటిదనుకోవడం కంటె (భర్తకు ఆస్తిగా వుండాలనేదే ఆమె అభిలాష) భర్తకు ఆమె భాగస్వామి అని పరిగణిస్తున్నారు కనుక గర్వపడుతుంది. శక్తి సామర్థ్యాలతో, జీవితంలో వహించే పాత్రలో పురుషులతో స్త్రీలు సమాన స్థాయి కలవారని అందరూ గ్రహించాలని ఆమె అభిలాష.

# సంక్రాంతి శోభ

శ్రీ మంద రామారావు

——(౦)——

పల్లవములపై నుండి
చల్లనైన పిల్లగాలులు
అల్లనల్లన సాగుతూ
ఉల్లమలరించుచుండ.

ఆలమంద లొప్పుచుండ
బాల బాలికలు లేచి
కాల కృత్యాల్ తీర్చుకొని
తల స్నానాల్ చేయుచుండ.

బాలుర చొక్కాలు ఫేంట్లు
బాలికల్ పరికిణీలు
వాటమైన క్రొత్త గౌన్లు
మాబాగా తొడుగుచుండ.

గుంపులుగా హుషారుగ
అందరునూ భోగిని చేర
దండలతో పర్విడుతూ
ముందునకు పోవుచుండ.

సన్నజాజి పూలవిరుల్
క్రొన్ననలు చామంతుల్
వన్నెమించులా జడలలో
కన్నెలంత తుర్ముచుండ.

గంగిరెడ్లవారువచ్చి
దండిగ కాన్కల్ గైగొని
సంచులన్ని బియ్యంతో
నింపుకొని పోవుచుండ.

తొలిసారి పండుగకు
వచ్చినట్టి బావలంత
ఒదినల్ మరదండ్రతో
ఆసికమ్ములాడుచుండ.

అమ్మలు వడ్డించినట్టి
కమ్మనైన వంటకాలు
సమ్మోదముగ పొట్టలో
నిమ్మళంగ వేయుచుండ.

పైరులన్ని కోసినాక
నూరుపులు అయినాక
రైతులు ధాన్యాలు అన్ని
కొట్టులలో పోయుచుండ.

చదువుకొనే ఆడుపాడు
బాలుర బాలికలంతా
అనుభవింప విశ్రాంతి
అడుగిడెను సంక్రాంతి.






రంగును చూసి మిల మిలా మెరసిపోయే కన్నులకు మహా పర్వం!

పారంపరిక సాహచర్యంవలన చేనేత కళాకారులు సాధించుకొనిన అపూర్వ వర్ణ సమ్మేళనం వారి సృష్టిలో రూపుదాల్చింది. ఋతువులకు, అనుభూతులకు, మరి మన భావనలకు అది ఎంత సన్నిహితంగా, అనుగుణంగా ఉన్నదీ చూస్తే మనం ముగ్ధులవుతాం.

ఏ సమయమైనా, ఏలాంటి సందర్భమైనా మనం ఆనందంతో ధరించగలిగేట్లుగా వర్ణమూ, రీతీ అద్వితీయంగా మేళవింపబడిన

# చేనేత
## వస్త్రాలు

మన సాంస్కృతిక చిహ్నం - మనకు గర్వకారణం




**ఆల్ ఇండియా హాండ్‌లూమ్ బోర్డు**

షాహిబాగ్ భవనం, ఎబెట్ రోడ్, బొంబాయి

DA-58/343






## అనపగింజల దోశ

అర్ధపావు అనపగింజలు, అర్ధపావు బియ్యం, కావలసినంత ఉప్పు, పచ్చిమిరపకాయలు సన్నగా తరిగినవి, అల్లం అమర్చుకోవాలి. బియ్యము, అనపగింజలను బాగా నానబెట్టి విడివిడిగా రుబ్బి పిండిని ఒకటిగా కలుపవలెను. మెత్తగా నూరిన అల్లం, పచ్చిమిరపకాయలు, ఉప్పు అందులో కలిపి నూనెనుగాని డాల్డానుగాని, నెయ్యిగాని, వాడి, దోశలు పోసి వేడిమీద తినినచో చాలా రుచిగానుండును.

## తొక్కుడు లడ్డు

అర్ధసేరు వేయించిన శనగపప్పును మెత్తగా రోటపొడిగొట్టి అందులో అర్ధశేరు చెక్కర కలిపి, నాలుగు చెంచాల పాలను అప్పుడప్పుడు పోస్తూ మెత్తగా దంచవలెను. తరువాత అర్ధపావు నెయ్యి బాణలిలో బాగా మరిగించి యీ దంచిన పొడిలో వేసి బాగా కలిపి ఉండలుగా చేయవలెను. ఇది శ్రమతక్కువతో తయారగు ఫలహారము.

మజ్జి వెంకటలక్ష్మి

## ప్రసాదం ఉండలు.

అర్ధపావు బియ్యపు నూకను కొద్దిగా నెయ్యివేసి ఎర్రగా వేయించవలెను. పావుసేరు నీళ్లలో నాలుగు చెంచాలపాలను కలిపి మరగబెట్టి అందులో వేయించియుంచుకొన్న నూకను వేసి బాగా కలుపుచుండవలెను. జీడిపప్పు, కిస్మిస్ ద్రాక్ష, యాలకులు, పావుసేరు పంచదార అందులో వేసి కలిపి, అర్ధపావు నెయ్యివేసి గట్టి పడేదాక పొయిమీదనుంచవలెను. చల్లారినతరువాత చిన్న చిన్న ఉండలుగా చేసియుంచుకొనవలెను. మరొకగిన్నెలో గోధుమపిండినిగాని, మైదాపిండిగాని తగుమాత్రం ఉప్పు వేసి నీళ్లుపోసి అంతముద్దగాకాని, పల్చగాకాని కాకుండా జారుడుగా కలిపి యుంచుకోవలెను. పొయి మీద బాణలిలో నెయ్యిగాని, నూనెగాని, డాల్డాగాని కాగనిచ్చి చేసి యుంచుకున్న ఉండలను కలిపి యుంచుకున్న పిండిలో ముంచి ఎత్తి బాణట్లో వేయవలెను. అవి వేగినతరువాత తీయవలెను. చల్లారిన తరువాత చాలరుచిగానుండును.

పి. అమ్మాజమ్మ

---

# 'పాపం బ్రద్దలైంది'

'రాఘవ'

(గతసంచిక తరువాయి)

పిల్లలు లేకపోవటంతో యింతటి అఘాయిత్యానికి పాల్పడదల్చుకోబోతున్నాడేమోనని, లోతుగా భావించింది. ఇంతలో గగ్గోలుచేస్తూ, బడి పిల్లలు వచ్చి, చాపలు పర్చుకొని కూర్చుండబోతున్నారు. వీరభద్రం, శారదవంక కిరాతుడిలాచూస్తూ, తన వాటాలోకి వెళ్లిపోయాడు. శారద ఒక్కనిట్టూర్పు విడిచింది. కడివెడుపాలని ఒక్క ఉప్పుగల్లు ఎలా విరిచేస్తుందో, ఆ విధంగానే వీరభద్రం, నారాయణరావు మనస్సునికూడా, విరిచేసి దురలవాట్లపాలు చేసాడు. మొగమాటంచేత ముందు వీరభద్రంచెప్పే మాటలతో సంతృప్తిపడి, ఆ సంవత్సరం శ్రీరామ నవమి ఉత్సవాలంటూ ఏర్పాటు చేసాడు. దానికి వూరివారివద్దనుండి చందాలుప్రోగుచేసి, తానొక అయిదువందలు వేసుకొని పదిహేను రోజులపాటు నిరాఘటంగా భజనలూ, హరికథలూ _ నాటకాలూ పెట్టించాడు. ఉత్సవాలు పూర్తయినయి. పెట్టుబడికి మించిన ఖర్చయింది. నారాయణరావు జంకకుండానే, నిలువచేసిన పైకాన్ని సర్దివేశాడు. ఆ దెబ్బలో నారాయణరావుకి దాదాపు వెయ్యి రూపాయలదాకా ఖర్చయింది. వచ్చిన నటులంతా, భాగవతార్లంతా నారాయణరావు యింట్లోనే చేతులుకడుక్కోవటంతో యింతఖర్చయిందని వూరు వూహించింది. 'ఇలాంటి వుత్సవాలు యింతవరకు మన వూళ్లో జరగనేలేదని మెచ్చుకున్న మోతుబరులు మోఖాసాదారులు నారాయణరావుని ఎంతో అభినందించారు. వీరభద్రంకూడా రెండు మూడుసార్లు రంగుపూసుకొని కురుక్షేత్రంలో కృష్ణుడి పాత్రనూ, రామాంజనేయ యుద్ధంలో రాముడిపాత్రనూ హరిశ్చంద్రలో విశ్వామిత్రుడి పాత్రను పురజనులు మెచ్చుకొనేటట్లువేశాడు. నారాయణరావుకి అమితానందం కల్గింది. అతనులోగడ పిచ్చాపాటీగా నాటకాల్నిగురించీ, నటుల నటనాశక్తిసామర్థ్యాల్ని గురించి చెప్తుంటే నారాయణరావు మామూలుగా వినగల్గాడేగానీ మనస్ఫూర్తి నమ్మలేదు. అలాంటిది కళ్లారాచూసిన తరువాత వీరభద్రంని పొగడకుండా వుండలేకపోయాడు.

"నువ్వు సినిమాల్లో చేరితే బాగారాణిస్తావోయ్!" అనికూడా అన్నాడు. అప్పుడు వీరభద్రం చిరునవ్వు నవ్వుతూ -

"మీలాంటివారు ఆసరాగావుండి, ఆదుకొంటే నేను సినిమాల్లో నటిస్తూ రాణించకుండా వుంటానా!" _ అన్నాడు. తరువాత యిరువురూ భుజాలమీద చేతులు వైచుకొని గృహోన్ముఖులయ్యారు.

ఇదే మొదలు, నారాయణరావు, వీరభద్రం చేతిలో కీలుబొమ్మ అయ్యాడు. తనకున్న విద్యలన్నీ క్రమక్రమంగా నారాయణరావుకి నేర్పుతుంటం సాగించాడు.

ఒక సంవత్సరం పూర్తిగా గడిచేసరికి, వీరభద్రం ఉద్బోధలతోనూ - మాయమాటలతోనూ _ లత్తుకోరు కబుర్లతోను - మోసం ఎత్తుగడలతోనూ, నారాయణరావు మనస్సు పూర్తిగా మారిపోయింది. శారద వున్నదా? _ లేదా అనే విషయంకూడా పెద్ద ఆలోచనగా లేకుండా పోయింది. ఏదైనా కావాల్సొస్తే వీరభద్రంతో చెప్పిపంపేవాడు. మునసబు గిరిమీద యావ, శ్రద్ధా, సన్నగిలిపోయి జగన్నాథం వాటాలో వెనకవైపువున్న గదిలో పేకాట ఆడుతూవుండేవాడు. అక్కడికి చేరేవాళ్లంతా వీరభద్రం చలవవల్ల వచ్చినవాళ్లే, యీ విషయం

నారాయణరావుకి తెలుసు. అయినా పెద్దతప్పుగా తోచలేదు. సరదాగా వూరివాళ్లతో ఆడుకోవటం అనుకున్నంత నామర్ధాకాదనుకున్నాడు. వీరభద్రం కూడా ప్రయివేటు స్కూలుమీద చిన్న చూపు విసిరి పేకాటభాయిగా మారాడు. ఎన్నడూ రాని మార్పు ఆ వూళ్లో ఒక్కసారిగా వచ్చేసింది. నారాయణరావు పేరుకి, అంతవరకూ ఎంతటి విలువా, సభ్యతా గౌరవం, ప్రతిష్ఠవున్నయో అన్నీ యీ మార్పులో తారుమారైనయి. మునసబులాంటి వాడే పేకాటాడుతూంటే యిక ఆ వూళ్లో ముక్కలు త్రిప్పనివాడెవడుంటాడు?

క్రమేపీ పేకాట, జూదంగా మారిపోయింది. మూడు నాలుగు నెలలు అమితోత్సాహంగా గడిచినయి. నారాయణరావు డబ్బు ఆటలో మునిగి, ఆస్తి అమ్మటానికి వీరభద్రం సలహాకోసం ఆలోచిస్తున్నాడు. శారద హెచ్చరించింది. ఎన్నో విధాలుగా బ్రతిమిలాడుకొంది. "సంతానం లేనందుకే ఎన్నో విధాలైనా అపవాదులుపడి యీ యింటిలో, మ్రగ్గిచస్తుంటే, పైగా మీకీ చెడు అలవాటులేమిటని" నిగ్గతీసి అడిగింది. నారాయణరావుకి సహజంగా విచక్షణాజ్ఞానంవుంటూ వుండేది. అది ఏమైందో శారద అలా అడిగేసరికి, ఆమె కర్థంకాలేదు. అతను వినిపించుకోలేదు. సూటీగా ఆలోచించాడు. జేబులు తడుముకొన్నాడు 'వీరభద్రం' అని కేకలేశాడు. అతను పలకలేదు. వెంటనే చేతిగడియారం చూసుకొన్నాడు. పన్నెండుదాటింది. ఎండ తీండ్రించుతోంది. ఆ రోజానంత మార్పు నారాయణరావులో ఎందుకు కల్గిందో ఎవ్వరికీతెలియదు. పరాసరి చెప్పులు తొడుక్కొని పేకాటవద్దకొచ్చాడు. వీరభద్రం మంచి ఆటలో మునిగివున్నాడు. యింకా యితర ఆటగాళ్లుకూడా తిండీ తిప్పలూ మానుకొనివున్నారు. ఆవూళ్లో ఎన్నడూ లేని ఒక చెడు అలవాటు ఎట్లా కల్గిందో కల్గింది. అంతే! ప్రొద్దస్తమానమూ ఆడినవాళ్లు ఆడుతున్నట్లే వుంటున్నారు. సిగరెట్లు తగలేసేవాళ్లు తగలేస్తూనేవున్నారు. వీరభద్రం ఎందుకో తలెత్తి చూశాడు. నారాయణరావు కనిపించాడు. ప్రయివేటు పిల్లలు తిళ్లు తినివచ్చి, మేష్టారి కోసం ఎదురుచూస్తున్నారు.

"ఇవ్వాల్టికి యిక ఆట ఎత్తేయండి"—అన్నాడు—సభికులంతా నారాయణరావు వంక ఎగా దిగా చూశారు. ఎప్పుడు అడ్డుచెప్పని మునసబు యివాళెందుకన్నాడా? అని వింత వింతగా ఆలోచించుకొంటూ, ఆట కట్టేసి లేచి, ఒళ్లు విరుచుకొని ఎవరి దారిన వాళ్లు చీలిపోయారు. వీరభద్రం నారాయణరావుని వెంటబెట్టుకొని, తన గదిలోకి వచ్చాడు. అప్పటికే పిల్లలంతా రావటంతో, నారాయణరావు, వీరభద్రం వంక చూసి—

"తర్వాత మాట్లాడదాం... నాకు పనుంది... అలా వెళ్ళొస్తా" అని చెప్పి వెళ్లిపోయాడు. యీ మాటలు వీరభద్రంకేగాక, శారదకు కూడా అర్థంకాలేదు. ఆశ్చర్యం వేసింది. కారణాలు రకరకాలుగా వూహించుకొన్నారు. పరిస్థితులు యిద్దరికీ భీతావహంగా వున్నయి. పిల్లలు చదువుతున్నారు. నారాయణరావు సంగతి క్రమక్రమంగా ఆ నోటా నోటా పడి, జగన్నాధంవరకూ వెళ్ళింది. అతను విభ్రాంతుడయ్యాడు. ఇట్లా మారిపోవటానికి కారణం ఏమిటో తెలియలేదు. డబ్బు తగలేస్తూ చెడు అలవాట్లకు లోనయి, పరువు ప్రతిష్ఠల్ని పోగొట్టుకోవటం సహించలేకపోయాడు. చూసి వద్దామని బయలుదేరి వచ్చాడు. ఆనాడే, మూడు గంటల సమయంలో నారాయణరావు లేడు. వచ్చిన బావగారికి మంచినీళ్ళిచ్చి, కుర్చీచూపింది. జగన్నాధం వ్యధితహృదయంతో నారాయణరావుని గూర్చి ప్రశ్నించాడు. వీరభద్రం యింట్లోలేడు, పిల్లలు చదువుతున్నారు. హఠాత్తుగా వచ్చిన జగన్నాధం యింటంతటిని కలయచూసి, చాలావరకు మారిపోయిందని వూహించాడు.

"ఇంట్లో అంతా కులాసాగా వున్నారా? మా అక్కగారేమంటోంది," శారద మెల్లిగా క్షేమ సమాచారాల్నడుగుతూ, దుర్గమ్మనిగూర్చికూడా అడి

గింది. జయలక్ష్మినికూడా అడిగింది. జగన్నాధం వాటన్నిటికీ సమాధానములిచ్చి, మళ్ళీ కాసిని మంచి నీళ్లు త్రాగాడు.

"ఎంతసేపైందీ వాడెళ్ళి" - నారాయణరావు సంగతి ఎత్తాడు జగన్నాథం.

"చాలాసేపైంది ...యీపాటికి వస్తూండాలి."
"ఎక్కడికి వెళ్ళాడో తెలుసా!"
"తెలియదు... కాఫీవేళవుతోందిగా! వస్తారు."
"వీడెందుకిట్లా మారిపోయాడు శారదా?"

శారద తలవంచుకొంది. ఎట్లా ప్రారంభించి, వున్న విషయాన్ని ఎరుక పర్చాలో తెలియలేదు. తన భర్తని గురించి, భార్యగా తాను చెప్పటం పొరపాటు అవుతుందేమోనని అనుమానించింది. కానీ, చెప్పక తప్పదు.

"తనకి భర్త కాకముందునుంచి, ఆయనకు తమ్ముడు. అలాంటప్పుడు తాను చెప్పకపోతే, ఎంత బాధపడతాడు..." శారద లోలోన అనునయపర్చుకొని,- వీరభద్రం గురించి, తానూహించినంతా చెప్పింది. అటుపిమ్మట భర్తనిగూర్చి, చెప్పుకొస్తూ-

"ఎటొచ్చీ మరీ యీ మధ్యనే బొత్తిగా మారిపోయారు. క్షణం సేపు యింటి పట్టున వుండమంటే వుండరు. అదేమిటండీ! అంటే, నాకేం తోచటం లేదంటారు. పిల్లా జెల్లా లేకపోబట్టేగా - యీ వీరభద్రం ఎంతో మంచివాడనే వూహించాను. అతనొచ్చిన తరువాతే, యీయన మరీ మన మనిషి కాకుండా పోయారు, పూలమ్మిన వూళ్ళో కట్టెలమ్ముకోవలసిన గతి పడుతోంది. ఎన్నిసార్లు చెప్పిన పెడచెవిన పెడుతున్నారు. ఏంచేయమంటారు?" కంటనీరొడుతూ అంటోంది. ఇంతలో నారాయణరావు, వీరభద్రాన్ని వెంటేసుకొని, కాఫీ త్రాగడం కోసం వస్తున్నాడు. జగన్నాధం చూశాడు. దగ్గరగా రానిచ్చి, కళ్ళజోడు తీసాడు.

నారాయరావు క్రుంగిపోయాడు అన్నగార్ని చూసేసరికి. వీరభద్రం భుజంమీదవున్న ఎడంచేయి, అంతలోకే క్రిందికి జారిపోయింది. మెల్లిగా లోపలికొస్తూ -

"ఎప్పుడొచ్చావ్ అన్నయా!" అన్నాడు. జగన్నాధం అప్పటివరకూ వీరభద్రం వంకే చూస్తున్నాడు... తెప్పరిల్లి...

"వచ్చి చాలాసేపైందిరా!"
"కాఫీ త్రాగావా?"
"లేదురా! నువ్వొస్తావుగదా అని ఆగాను..."

"తీసుకురావే".-అని శారదవంక చూశాడు నారాయణరావు. వీరభద్రం ఎందుకో, జగన్నాధాన్ని చూస్తూ కలవరపడుతున్నాడు; ఎప్పుడిక్కణ్ణుంచి కదిలి అవతలికి పోతానా" అని ఎదురు చూస్తున్నాడు, ఇంతలో శారద కాఫీలు అందరికీ తెచ్చి యిచ్చింది. క్షణంలో త్రాగిన వీరభద్రం నారాయణరావుతో 'వస్తానని' చెప్పి ఆ ఛాయల్లో లేకుండా లైబ్రరీ దగ్గరికిపోయాడు. జగన్నాధం భారంగా ఒక్క నిట్టూర్పు విడిచాడు. నారాయణరావు చకితహృదయుడై అన్నగారి కెదురుగా మరో కుర్చీలో కూర్చున్నాడు. సిగరెట్ కాల్చటానికి ధైర్యం చాలటంలేదు.

"ఒరేయ్ నారాయణం...!"జగన్నాధం చుట్టు చుడుతూ ముఖం వంక చూశాడు. నారాయణరావు తలెత్తి చూశాడు.

"నీ ప్రవర్తనేమీ నచ్చటంలేదు" - సూటీగా అన్నాడు. నారాయణరావు తలవంచుకొన్నాడు. అన్నగారంటే ఎంతటి భక్తి - వినయం అతనికున్నాయో, ఆ సమయంలో తేటతెల్లమైంది.

"చెడు సహవాసాలతో, డబ్బునిట్లా దుర్వినియోగపర్చటం మనబోటి వాళ్లకు మర్యాదైన పని గాదు ... నువ్వేమీ చంటివాడివి కాదుగా! నా అంతటివాడివి. మనవంశ గౌరవానికీ, పేరు ప్రతిష్ఠలకి కళంకం తీసికొని రావటం సమంజసంగాలేదు. పిల్లలులేనంత మాత్రాన, ఏమీతోచటంలేదని దురభ్యాసాలకు అలవాటుపడటం మంచిలక్షణంగాదు.

రక్తస్పర్శగలవాళ్లం. నువ్వుచెడిపోతుంటే చూస్తూ వూరుకోవటం నాకు చేతగానిపని. అమ్మచనిపోయే నాటికి నువ్వెంతో పసివాడివి. నాన్న నీ కోసం ఎంతో శ్రమపడి, తిండీతిప్పల్ని లెఖచేయకుండా నీ క్షేమంకోసం పాటుపడ్డాడు. నువ్వు బాగుపడి, నా అంతటి వాడివవుతావని ఎన్నో కలలుగన్నాడు. నీకోసం, ఆయనేగాకుండా నేనూ సకలశ్రమలు అనుభవించాను. చాలా కాలానికి నా తరువాత ఎవ్వరూ పుట్టలేదని బెంగగా వుంటున్న రోజులలో, తమ్ముడివిగా నువ్వు పుట్టావు. తోడబుట్టినవాడివైనందున నిన్నే చెల్లివిగా భావించాను. నువ్వే తమ్ముడవని నమ్మాను. రాముడికి లక్ష్మణుడు ఎలాసాయపడి, జీవితాన్ని ధన్యత పర్చుకొన్నాడో నువ్వూ అలాగే చేసుకొంటావని ఆశించాను. ఇంతవరకూ నువ్వంటే ఎంతో ప్రేమాభిమానాల్ని కల్గివున్నాను. నీకష్టం వచ్చినా నేను సహించలేను. నేనుబ్రతికివుండగానే, నువ్విట్లా అసభ్యంగా ప్రవర్తించటం ఎంతనీచమైన పని. మానాభిమానాల్ని మంటగలుపుకొని, బ్రతకటం వల్ల ఏమిటీ ప్రయోజనం? చూడబోతే, వాస్తవానికి మీం దంపతులిద్దరూ ఎంతో చిన్నవాళ్లు. లోకమనుటే ఏమిటో తెలియదు. హాయిగావున్న ఆస్తిని అంథవిస్తూ, చేతిలోవున్న మానసబుగిరిని చేసుకొంటూ చల్లగా బ్రతికవలసింది పోయి చెప్పుడు మాటలతో మనస్సుని చెడగొట్టుకొని ఎంతకాలం యిట్లా దిక్కుమాలిన బ్రతుకు బ్రతుకుతావు. శారదనిట్లా ఒంటరిపాలుచేసి నీ దారినువ్వు ఏమీ పట్టనట్టుగా తిరిగితే దానిగతి ఏంగానూ! యివన్నీ నీకు నేను చెప్పాలా నారాయణం!”

జగన్నాథం కాస్తాగి చుట్ట అంటించుకొన్నాడు. అన్నగారనే ఒక్కొక్కమాట నారాయణరావు గుండెలికి యీటెపోటులాగా తగులుతోంది. కళ్లనీళ్లపర్యంతమైనాడు. తలెత్తిజవాబుయిచ్చేతాహతు యెప్పుడూ లేనేలేదు. జగన్నాథం అంటే కేవలం అన్నగారనే దృష్టేగాక ‘తండ్రి’ అనే మూఢ భావంకూడావుంది. చదువుచెప్పించి పెళ్లి చేసి చెక్కుచెదరని ఆస్తిని చేతులారా తన చేతులకప్పచెప్పి మునసబుగిరినిచ్చి సుఖంగా బ్రతకమని అన్న, ఒక సాధువర్తనుణ్ణి ఎదిరించి పల్కే ధైర్యం లేనివాడు నారాయణరావు. అక్కణ్ణుంచి జగన్నాథం ఎంతో సేపు హితోపదేశంచేశాడు. ఎన్నో నీతివాక్యాల్ని చెప్పాడు. మంచి మార్గాల్ని వుదహరణగా చూపించాడు. బుద్ధి మార్చుకోమని కోరాడు. యింతవరకు పోయిన డబ్బుని గూర్చి విచారపడవద్దని ధైర్యం నూరిపోశాడు. శారదని కనిపెట్టుకొని వుండమన్నాడు. ఆమెకేలోటూ కల్గించవద్దని మరీ మరీ జాగ్రత్తగా చెప్పాడు. నువ్వేమాత్రం చెడుగా తిరిగినా శారద మనస్సు చెదరిపోతుందని హెచ్చరిక చేశాడు. పిల్లలు లేరని దిగులుపడవద్దన్నాడు. భగవంతుణ్ణి పూజించమన్నాడు. సక్రమంగా జీవితాన్ని మంచితనంతో గడుపుకోమని పదేపదే చెప్పాడు. శారద హృదయానికి, జగన్నాథం మాటలన్నీ ఎంతో శాంతిని చేకూరుస్తున్నాయి. నారాయణరావు అన్నీ వింటూనే దానిగుంటలో పడుకొని అనుకునే శునకం మాదిరిగా లోలోన ఆలోచిస్తూ అనుకోసాగాడు. నిజంగా నారాయణరావు హృదయం ఎంత మూర్ఖంగా మారిపోయింది. వీరభద్రం ఎంతటి ఘటికుడు! వెన్నపూసలాంటి మనస్సుని విరిచేసాడు. పాషాణంకంటే కఠినంగా మార్చాడు. జగన్నాథం మాటల్ని వినగల్గాడేగాని నారాయణరావు మనస్సుని మార్చుకోగల్గేడా! లేదు ఎంతటి దురదృష్టవంతుడు గాకపోతే యిలా మారాడు! వినాశకాలం వచ్చే సూచనలుండబట్టేనేమో! విపరీత బుద్ధులు పుడుతున్నాయి. లేకపోతే నారాయణరావులాంటి వాడికి, దిక్కుమాలినవాడైన వీరభద్రం స్నేహితుడుకావాలా! కాదు కాదు బంధువేకావాలా! కర్మ ... నారాయణరావు శ్రద్ధగా వింటున్నాడని అపోహపడి, జగన్నాథం చెప్పినమాటల్నే మళ్లా చెప్పిచూశాడు. అతనేం మారుమాట్లాడలేదు. విన్నాడుగదా! బాగుపడతాడేమో! నని భావించి వ్రిప్తిగా ఆ రాత్రికి యింటికి చక్కాతిరిగి వచ్చేశాడు. శారద ఆరాత్రి నిశ్చింతగా నిద్రపోదా

మనుకుంది. బావగారి వుద్బోధతో, భర్త నిజంగా మారిపోతాడని తియ్యని కలలుగంది. ఆరాత్రికి వంటకాలన్నీ కమ్మగా తయారుచేసి భర్తని తృప్తిపర్చగల్గింది. అతనికోసం ప్రత్యేకంగా క్రొత్త చీర, పెట్లోంచి తీసి కట్టుకొంది. వాలుజడ వేసుకొని చక్కగా ముస్తాబైంది. దొడ్లోని మల్లె పూవుల్ని మనసుదీరా పెట్టుకుంది. కాటుక కళ్లతో నారాయణరావుకోసం ఎదురు తెన్నులు చూస్తూ వాకిటివసారాలో మంచంవాల్చుకు కూర్చుంది. భోంచేసి వెళ్లినభర్త ఎంతకీరాకుండటం వల్ల నిరీక్షణ ఎక్కువైంది. వీరభద్రం ఆ పూట, నారాయణరావుతో భోజనానికిరాలేదు. ఎక్కడ తిన్నాడో ఎవ్వరికీ తెలియదు.

మామూలుగా జగన్నాథం వాటాలో పేకాట ఆడేవాళ్లు అలాంటివాళ్లు, ఆ మధ్యాహ్నం, నారాయణరావు పెట్టిన సమావేశంలో పీర్ల పంజాలోకి మారుద్దామని తీర్మానించారు.

పీర్ల పంజా ఆ వూరికి పడమరగా, కాస్త దూరంగావుంది. వూరు మాటుమణిగినపిదప, ఆ ప్రాంతానికెవ్వరూ పోరు, నిశ్శబ్దంగా వుంటుంది. ప్రక్కనే పెద్ద చెరువు. దానిగట్టుమీద వేసవి కాలంలో ఆవూరి వాళ్లు చల్లగాలికి చతికిలపడి కూర్చుంటూ వుంటారు.

నారాయణరావు మాటమీద ఆ రోజునే పీర్ల పంజాలో చీట్లాటకు ప్రారంభోత్సవం చేసారు. ఎవరివల్లారద్దీలేకుండా నిర్భీతిగా ఆడుకోవచ్చునని వీరభద్రం నారాయణరావుతో అన్నాడు. అతను సంతోషించాడు.

ఒక వైపు శారద భర్తకోసం చీకట్లో ఎదురు చూస్తోంది. మరోవైపు నారాయణరావు, ప్రామిసరీ నోటువ్రాసితెచ్చిన అయిదువందలతో జూదం ఆడుతున్నాడు. వీరభద్రం నారాయణరావుకి సారధిగావుండి, సలహాలిస్తున్నాడు. ఆటగాళ్లు క్రొత్తరోజనేమో! వుషారుగా డబ్బును గుమ్మరిస్తూ క్రొత్తపేకని కత్తెరవేస్తూ ఆడుతున్నారు. వీరభద్రం సలహాలతో రెండుగంటలాడేసరికి నారాయణరావుకి వెయ్యిరూపాయలు వచ్చినయి.

వీరభద్రం కన్నుగుట్టింది, తానూ ఆడదామని, జల పుట్టింది. వెంటనే నారాయణరావుని లత్తుకోరు కబుర్లతో వుబ్బేసి అయిదువందల్ని రాబట్టాడు. తిరిగి ఆటమొదలైంది. అప్పటికి పన్నెండుగంటలు దాటినయి. చీకటి దట్టంగా అలముకొంది.

శారద నిరీక్షణలో విసిగి వేసారిపోతుంది. తను అలంకరించుకొన్న అలంకారమంతా వృథా అయిపోతోందని నిరాశచెందింది. ఒంటరిపాటుకి తాళలేక పోయింది. "పిల్లలుంటే వాళ్లని పక్కలో వేసుకొని యీపాటికి పడుకొని వుందునుగదా!" అని భావించింది. "తాను గొడ్రాలు కాదుగదా!" శారద లోకంచెప్పుకొనే మాటని పునశ్చరణచేసుకొంది. కాకపోతే సంతానం ఎందుకు కలగటంలేదు? పున్నామనరకం దాటేదెట్లా. గత్యంతరం ఏమిటి? తన యీడువాళ్లు ఎంచక్కగా సంతానవంతులయ్యారు. ముద్దుముచ్చటగా వున్నారు. తనకేరి? ఏంచేసానని అంతపాపం! భగవంతుడు నా మీద యింతచిన్నచూపు చూశాడూ! ఏ కొరగాని నోములు నోచుకొన్నానో! ఎవరికే అన్యాయం చేసానో! ఏపాపానికి ఒడిగట్టుకున్నానో! దిక్కుమాలినదాన్నైనాను. తనకింత యిల్లు వుండేం లాభం? పిల్లలుగల యిల్లు కాకపోయిన తరువాత, శారద క కాలికల పడుతూ, బాధాకులితస్వాంతురాలైంది. చెరిసగం రాత్రి దాటింది. నారాయణరావుకి, ఆడుతున్న కొద్దీ డబ్బు అంతకంతకు పెరుగుతోంది. (సశేషము)

# కొందరు విస్మృత సంస్కృత కవయిత్రులు

శ్రీమతి వాడ్రేవు భానుమతి దేవి

సంస్కృత సాహిత్యమనేసరికి మనకు కాళిదాసు; బాణభట్టు, భానుడు, భవభూతి మొదలైన మహాకవులు వెంటనే స్ఫురణకు వస్తారు. అయితే ప్రపంచంలోని అనేక యితర భాషలవలెనే సంస్కృతంలోకూడా అత్యుత్తమమైన కవిత్వం చెప్పి కొన్ని ఎడల మగవారిని మించిన కవయిత్రులు లేకపోలేదు. కారణం అడిగితే మనం ఏమీ చెప్పలేముకాని మన సాహిత్యాలలో కవులకున్న ఆదరణ, కీర్తి కవయిత్రులకు లభించలేదు. రచనావైచిత్రిలో, కథాచిత్రణలో ఎందునా తీసిపోకపోయినా రంగనాథ రామాయణమంటే మనవారికున్న ఆదరణ ఛందం వేరయినా మొల్లరామాయణమంటేలేదు. మహాకవులను ఈనాటికీ మనం పూజిస్తున్నాము - కవయిత్రులను, కవయిత్రులని పిలువడానికికూడా సంకోచించేటంతగా విస్మరించాము. సంస్కృత భాషలో కవిత్వం చెప్పిన కొందరు విస్మృత కవయిత్రులనుగూర్చి వారి కవిత్వంలోని కొన్ని భాగాలకు తెలుగు అనువాదంచేర్చి ఈ చిన్న ప్రసంగంలో ముచ్చటిస్తాను.

చిన్నమ్మ:-10 వ శతాబ్దం ప్రాంతానికి చెందిన కవయిత్రి. 'శార్దూల విక్రీడిత' ఛందంలో కవిత్వం చెప్పినది. మహాభైరవుడు రుద్రమూర్తే అయినప్పటికీ ఎంతటి కరుణాసంభరితుడో ఈమె తన కావ్యంలో ప్రస్ఫుటం చేసినది.

కల్పాన్తే శమితత్రి విక్రమ మహా కంకాళ దండ స్ఫురచ్
ఛేషస్యూత నృసింహపాణి నఖరప్రోతాది కోలా మిష:
విశ్వైకారణవతా నితాంతముది తౌ తౌ మత్స్య కూర్మావుభౌ
కర్షన్ ధీవరతాం గతోస్యతు మహా మోహం మహా భైరవః

(కల్పాంతంలో తాను సంహరించిన త్రివిక్రముని బొమికెలుచే కర్రగాధరించిన పరమశివుడు, ఆదిశేషునితో నృసింహుని హస్తాలు బంధించిన మహేశ్వరుడు, సికర శరీరాన్ని తన నఖాలతో చీల్చిన పార్వతీపతి, విశ్వమంతాలయమైనపుడు ఆనందించిన మత్స్యాన్నీ; కూర్మాన్నీ చేపలవాని రూపంలో వెలికీడ్చిన మహాభైరవుడు కారుణ్యంతో ఈ విపత్కర స్థితినుండి తరింప జేయునుగాక)

కేరళి-ఆర్యఛందంలో ఈమె వ్రాసిన సరస్వతీస్తవమనే కావ్యం మనకు లభ్యమవుతున్నది. పేరునుబట్టి మనం అనుమానించినా ఈమె కేరళ దేశస్థురాలు కాదని పండితులు అభిప్రాయ

పడుతున్నారు. సరస్వతీ దేవిని ఆరాధించినవారికి సర్వవిద్యలూ కరతలామలకం అవుతాయనే భారతీయుల విశ్వాసమే ఈ కావ్యానికి మూల ఇతివృత్తం.

యశ్యాః స్వరూప మఖిలం జ్ఞాతుం బ్రహ్మాదయోపీ నస్పష్టాః
కామగవీ సుకవీనాం సా జయతీ సరస్వతీనీవీ

(సత్కవులకు కామధేనువై బ్రహ్మ మొదలైనవారు కూడా యదార్థంగా అవగాహన చేసికొన జాలనిదైన సరస్వతీ దేవికి జయతు)

నాగమ్మ: ఉదయ భాస్కర స్తోత్రం అనే ఈమె వ్రాసిన కావ్యం. 'సారంగధర పద్ధతి'లో ప్రక్షిప్త పరచబడినది. ఆకాశంలో అందంగా ఎగిరే చిలక ముక్కుతో సూర్యుని పోల్చినదీ కవయిత్రి.

శుకతుండచ్ఛవి సవితుశ్చండరుచః పుండరీకవనబంధోః
మండల ముదితం వందే కుండల మాఖండలాశాయాః

(చిలుక ముక్కు లా, ప్రాచ్య సీమా మూర్తి కర్ణాభరణంలా, వెలుగొందుతూ పద్మావన ప్రియమైన ప్రకాశమూర్తి ఉదయభాస్కరునికి ప్రణమిల్లుతున్నాను.)

లక్ష్మి:-లయప్రధానంగా, తత్త్వవిషయ సంభరితంగా ఆమె వ్రాసిన కావ్యంలో ప్రాణి కేవలమూ నిమిత్తమాత్రుడు - పరమేశ్వరుడే జగన్నాటక సూత్రధారుడనే సత్యం ప్రస్ఫుటమాతుంది.

భ్రమన్ వనాంతే నవమంజరీషు నషట్పదో గంధఫలీమజిఘ్రత్
సాకిన్ నరమ్యా నచకిన్ నరంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా,

(నవవికసిత కుసుమాలతో నిండిన ఉద్యానంలో విహరించే భ్రమరం, చంపక పుష్పం చెంతకుపోలేదు. అది తనకు ఇష్టం లేకపోయెనా? లేక తనకు ముదం కూర్చక పోయెనా? ఈశ్వరాజ్ఞ ఎంత బలవత్తరమైనది!

సరస్వతి:-"సదుక్తి కర్ణామృతము," "సారంగధరపద్ధతి" మొదలైన కావ్య సముచ్ఛయాలలో చేర్చబడిన ఈమె కవిత్వము దైవాంశ సంభూతులైన మహారాజుల క్షేమాన్ని ఆకాంక్షించే ఇతివృత్తంతో ఉన్నది. ఉత్తములైన వారు మానవులలోని దోషాలను క్షమించి, వారిలోని మంచినే ఏవిధంగా గ్రహిస్తారో ఆమె చక్కగా వ్రాసినది.

"దేవత్వమేవ పాతాళ మాపానాంత్వం నిబంధనం
త్వం చామరమరు ద్భూమి శ్చేకో లోకత్రయాత్మకః

(రాజా, నీవే సర్వరక్షకుడవు; మాలో ఆశలు, ఆశయాలు రేకెత్తించేది నీవు, చామరం వేయించుకొన అర్హుడవు నీవే.

ఒక్కడవే అయినా మూడు లోకాల ఆత్మసీలో నిబిడీకృతమైవున్నది.

వికటనితంబ:-ఆనంద వర్ధనుడు తన 'ధ్వన్యాలోకం' గ్రంథంలో పేర్కొని ప్రశంసించిన కవయిత్రి ఈమె. 9వ శతాబ్దం నాటిదైన ఈ కవయిత్రి "లావణ్య సింధూర అపరైవ కేయమ్ అత్ర" మొదలైన మధురమైన ఖండికలు వ్రాసినది. ఈమె తన కవిత్వంలో సుందరములైన అనేక భండాలు ఉపయోగించినది.

అభిహితాప్యభియోగ పరాంగముఖి ప్రకట
మంగ విలాస మకుర్వతి
ఉపరితే పురుషాయితు మత్ర మా నవవధూ
రివశత్రుపతాకినీ

ఓ రాజా, నీ శత్రుసేన నూతన వధువు లాంటిది. ఎదిర్చినా, ప్రతీహారానికి సన్నద్ధము కాదు. తన ప్రతిభ ప్రకటించదు. తన విక్రమం చూపదు.)

చంద్రకాంత భిక్షుణీ:-పేరునుబట్టి ఈమెను బౌద్ధభిక్షుణిగా గుర్తించడం తప్ప ఇతర వివరాలేమీ మనకు తెలియవు. అవలోకితేశ్వర స్తోత్రవర్తి ఈమె. బోధిసత్త్వ అవలోకితేశ్వరుని భౌతిక సౌకుమార్యాన్నీ, అంతః సౌందర్యాన్నీ ప్రస్తుతిస్తున్నదీమె ఈ కావ్యంలో.

భువనత్రయ వందితలోకగురుం
అమరాధిపతి స్తుతిబ్రహ్మవరం
మునిరాజువరం యతిసిద్ధికరం
ప్రణమామ్యవలోకితసాధుధరం

భువనత్రయం చేతనూ వందితుడైన గురునికి; అమరాధిపతిచేత స్తుతింపబడినట్టి ఆత్మజ్ఞాన పారంగతునికి, మునిశ్రేష్టునికి; యతిజయసిద్ధికారునికి ప్రణమిల్లుతున్నాను.

వైజయంతి:-కవియైన భర్త సహకారంతో ఆనంద లతికా చంపూ కావ్యం వ్రాసినది. ఈమె మహా విద్వాంసురాలు; వేదాంతవేది అని తెలుస్తున్నది.

లక్ష్మీరంజని:-శ్రీమద్భాగవతంలోని దశమ స్కంధంలోని ఒక చిన్న కథ ఆధారంగా 'ఈమె సంతాన గోపాల కావ్యం' వ్రాసినది. ఈమె మలబారు రాజవంశానికి చెందినదని తెలుస్తున్నది.

ఇంకా తంజావూరు సంస్థానానికి చెందిన మధురవాణి; రామభద్రాంబ; తిరుమలాంబ; మొదలైనవారెందరో వున్నారు. మధురవాణి అనే కవయిత్రి రఘునాథరాజు తెలుగులో రచించిన రామాయణాన్ని సంస్కృతంలోనికి అనువదించినది.

వీరుకాక ఇంకా ఎంతోమంది స్త్రీలు సంస్కృతంలో చక్కని పాండిత్యం సంపాదించి; రసజ్ఞులైనవారు తలలూపగల విధంగా కవిత్వం చెప్పినవారున్నారు. లబ్ధప్రతిష్ఠులైనవారి కావ్యాలను ఏవిధంగా చదువుకొని ఆనందిస్తున్నామో, అలాగునే ఈ విస్మృత కవయిత్రుల రచనలను కూడా చదువుకొనడం మనం నేర్చుకోవాలి.

# శోభనం నాటి చీర

శ్రీ కానాదిభట్ల వెంకటసుబ్బారావు



అందరికీ ఆ రోజు ద్వాదశి ఐతే నాకు మాత్రం ఏకాదశి అయింది. ఆఫీసరు చచ్చేటంతపని ఒప్ప చెప్పటంవల్ల మధ్యాహ్నం ఇంటికి రావటానికి క్కూడా వీలుపడిందికాదు. చచ్చీ చెడీ చాకిరి ముగించుకొని ఆఫీసు వర్క్కులోంచి తప్పించుకొని కొంపకు చేరాను. కాని కథ అడ్డం తిరిగింది! గుమ్మంలో అడుగు పెట్టానో లేదో అప్పుడే విస విసలూ బుసబుసలూ ఆరంభమయినయ్. ఈ రోజున ఏదో ప్రళయం ముంచుకొచ్చేట్టుందిరా గాడ్ అను కుంటూనే కుర్చీలో చేరగిలబడ్డాను. ఎంతసేపు కూర్చున్నా కాఫీ అయినా తేలేదు సరికదా వాతా వరణం అంతా గప్ చప్ గావుంది. ఇదివరకు నేను గుమ్మంలో ఎదురుపడగానే చిరునవ్వులతో స్వాగత మిచ్చే మా సీతాకోకచిలుక ఇవ్వాళ కంట్లో నలుసై పోయిందేమిటి చెప్మా. అని నాలో నేనే యుద్ధం చేసుకుంటూ కొంచెం చెవులు రిక్కించాను. వంట యింట్లో వస్తుసామగ్రికాబోలు ధనాధన్ మంటు న్నయ్. రెండు బాడీలు జారిపడిన శబ్దం కూడా వినిపించకపోలేదు. కడుపులో రాముడు మాడిపో తున్నాడు. కాఫీనీళ్ళయినా పడకపోతే జీవాత్ముడు ఏడిచిపోడూ మరి! సరే ఏమైతే అదయింది. వంట ఇంట్లోకి పోయి సంగతేమిటో కనుక్కుందామని ధైర్యంచేసి లేవబోయి కూలబడ్డాను. ఇహ విధిలేక "ఇంట్లో వున్నావా?" అన్నాను.

"ఆ! చచ్చాను—" లోపలనుండి ఉరుము విని పించింది. వులిక్కిపడ్డాను.

"హాతోస్మి!" అని చెవులు మూసుకున్నాను.

"మీకుమల్లే నాకు ఆఫీసా! వల్లకాడా! సాయంత్రమయ్యేసరికి కొంపకు చేరుకోటానికి" కాఫీ గ్లాస్ మధ్య బల్లమీద పెట్టింది.

"ఏమిటీ లీలా! అంతకోపం? అపరాధం ఏదైనా వుంటే చెప్పు! నీ చేత్తోనే చెంపదెబ్బ వేయించు కుంటాను."

"ఇదొక విద్య నేర్చుకున్నారు. మాట మాట్లా డితే చెంపదెబ్బ లంటూనూ!"

"ఇంతకూ..."

"ఏమిటని అడుగుతున్నారా పాపం! అవును మరి. మీకు కావలసిన సిగరెట్ పెట్టెలూ, కాఫీ హోటళ్ళ ఖర్చులూ అయితే గుర్తుంటయికాని నే తెమ్మంది చచ్చినా గుర్తుండదు!"

"ఇంతకూ తమరేం ఆజ్ఞాపించారు రాణీగారూ?"

"అలా దారికిరండి రాజాగారూ! ఆఫీసు నుండి వచ్చేటప్పుడు 'క్రేప్ సిల్కు చీర' తెమ్మని మూడ్రో జులబట్టీ మొత్తుకుంటున్నానా! ఇదిగో తెస్తా అదుగో తెస్తానని కాలం గడిపేశారు. సంక్రాంతి పండగ్గదా! ఒక్కచీర తెచ్చి పెడదామని వుండొద్దూ. మీకు ఒక ముద్దూ లేదు, ముచ్చటా లేదు అంతా నా ఖర్మ." కళ్లమ్మట నీరు పొర్లుకుంటూ వస్తూనేవుంది.

ఆడవాళ్లకు ఆగ్రహం వచ్చినా అనుగ్రహం వచ్చినా పట్టశక్యంకాదు. కంటనీరు రావటం మొద లైతే మగవాడు వోదార్చినకొద్దీ మరీ ఎక్కువైపో తుంది.

"ఓ! అదా సంగతి - ఐమీన్ ఆఫీసు గొడవలో పడి చీర సంగతి మరిచిపోయాను. I am very Sorry My dear Leela!"

"క్షమాపణలయితే చెప్పుకుంటారు కాని చీర సంగతి చెప్పరేం!"

"ఒకటో తారీకు..."

నాకదంతా తెలీదు. మీ ఖర్చులకయితే ఒకటో తారీఖు అక్కర్లేదు. నేను తెమ్మన్నదానికల్లా ఒకటో తారీకు పాపం! ఇన్ని సామాన్లుండగా మాయదారి దొంగలకు ఆ చీరే కావాల్సివచ్చింది. ఆ రోజు దొంగలుపడి నా చీర ఎత్తుకుపోయిన దగ్గర్నుంచీ నా మనసులో మనసులేదు. ఆ నాటి క్రేప్ సిల్కు చీర కట్టుకుంటే నిజంగా నాకేదో మధురభావం హృదయంలో మెదులుతుంది. ఏమండీ నాకా సిల్కుచీర తెచ్చిపెట్టరూ!" దీనంగా చూస్తూ అడిగింది.

ఎంత గుండె నిబ్బరంకల మగరాయుడైనా అలా దీనంగా అడిగితే కాదంటానికి నోరొస్తుందా అంటారా? నాకు నవ్వాగింది కాదు. మా శ్రీమతి చిలిపితనం చూస్తూంటేనూ.

"ఆ చీరే కావాలంటావ్?"

"అవును ఆ చీరే కావాలి!"

"అంత Cost పెట్టటమంటే మాటలా చెప్పు లీలా! నా మాట విని ఏదో సాదారకంతో..."

"ఎన్నో రకాలు తెచ్చి పెడుతున్నట్టు, ఇప్పుడీ రకం తేలేనట్లూనూ అన్నీ నంగనాచి కబుర్లు!" బుంగమూతి త్రిప్పింది.

"క్రొత్త పెళ్ళికూతురు వేంకాదుగా లీలా! శోభనం నాడు కట్టుకున్న ఆ చీరె కావాలంటే ఎలా చెప్పు! ఆ చీర కాస్తాకూస్తా ఖరీదుందా - రెండువందల రూపాయలు!"

"ఊహు నాకదే కావాలి! మరి తెచ్చిపెట్టరూ!"

నేను నవ్వుతూ-"శోభనంనాటి ఆ చీర ధరించి నాటి సిగ్గూ గిగ్గూ, బిడియం గిడియం అంతా పోగు చేసికొని నా ముందుకు రావాలనా? ఏ చీర కట్టుకున్నా గదిలోకి రానివ్వటానికి నాఅభ్యంతరం ఏమీలేదులేమా! ఏమంటావ్ శోభన పెళ్ళికూతురా!"

"అదే కావాలంటాను, పెళ్ళికొడుగారూ!"

"మరి తప్పదంటారా రాణీగారూ."

"తప్పదూ! తప్పదూ! తప్పదూ! తెలిసిందా! రాజాగారూ!"

శ్రీమతి బుగ్గమీద ఇలా చిటికెవేసి అనుకోకండా ముద్దుపెట్టేసుకొన్నాను. నా చిలిపిసరసానికి తనకు రానికోపంతో మొగ్గలా ముడుచుకునిపోయింది. "పొండి! మీరు మరీనూ వేళాపాళా లేకండా ఏమిటి మీ సరసాలూ_ఎవరైనా చూస్తే ఏమనుకుంటారూ!" బుగ్గమీద ఎంగిలి తుడుచుకుంటూ అంది.

"ఏమనుకుంటారూ! మొగుడు పెళ్ళాం సరసాలూ! సరదాలూనూ!"

"చాల్లెండి! స్నానంచేసి త్వరగమే రండి." అంటూ తుండు నామొహాన పారేసి ఆఫీసురూంలోకి పారిపోయింది.

క్రిందటేడాదే మా పెళ్లయింది. పెళ్లి అయిన మూడోనాడే శోభనం కూడా చేసి పారేశారు, అప్పుడు నేను బి. ఏ. ఫైనలియర్‌లో వున్నాను. పెళ్లి మటుకు ఆపరాని పరిస్థితుల్లో చకాచిక్కీ అయిపోయింది. "వాడికి పరీక్షలుకూడా దగ్గర పడుతున్నయ్. తర్వాత శోభనం చెయ్యొచ్చులే! అది కూడా అయిపోతే వాడు కొత్త మోజులోపడి పరీక్షను నాన్న చుట్టేస్తాడు!" అన్నారు నాన్న. మా మామగారు మాత్రం "సింగినాదం జీలకర్రానూ కార్యం అయినంత మాత్రాన తప్పేంటా ఏంటి-! ఖర్చులో-ఖర్చు! ఆ ఒక్కటి మాత్రం తరుగెందుకూ! కానిద్దాం." అన్నారు.

"అయినా అబ్బాయిని కనుక్కోండి." అన్నాడా పెద్దమనిషి.

నాకు ఎక్కడలేని సిగ్గూ ముంచుకొచ్చింది-"పరీక్షలయింతర్వాతే ఆ గొడవంతానూ!" అన్నాను ఇష్టంలేనట్లు. తీరా అన్నతర్వాత నాలిక్కరుచుకున్నాను "కొంపతీసి వీళ్లు నా మాటప్రకారమే శోభనం వ్యవహారాన్ని వాయిదా వెయ్యరుకదా" అని మనసులోనే పిచుక్కు చచ్చాను. పెద్దవాళ్ల ఎదుట ఆ మాత్రం డాబుసరి ప్రదర్శించకపోతే నన్ను తేలిగ్గా చూస్తారు

మరి, మా బావమరిదిగాడు పిసినిగ్రొట్టు పరీనా. ఎక్కడా లేనివన్నీ వాడికే కావాలి! "గాభరా పడకు బావా శోభనం వాయిదా వెయ్యటంలే!" అని నవ్వుతూ తుర్రుమన్నాడు.

అంతా గప్‌చిప్‌గా జరిగిపోయింది. ఆనాడు అది కట్టుకున్న చీరే నాకూ నచ్చింది. చాలా బావుం దని పొగిడేశాను కూడా! మా ఆవిడ కేకవిని వులిక్కిపడి లేచి స్నానాలగది వైపు బైలుదేరాను.

భోజనంచేసి బట్టలు వేసుకున్నాను. మా శ్రీమతి తయారయింది. "ఇక వెళదామా!" అంటూ.

"గదిలో లైట్ ఆల్‌రైట్ నేనూ రెడీనే."

ఆ మాటకు నా చెంపమీద దెబ్బ తగలకుండా కొట్టి. "మరీ పసిపిల్లాడై పోతున్నారు!" అంది.

అయినా దానిదగ్గర డబ్బువుండి వుంటుంది అందుకే ఇంత దర్జాగా వెళదామా అంటుంది. నాదేంపోయింది అనుకొని 'పద!' అన్నాను.

బెసెంట్‌రోడ్ సెంటర్‌లో షాపులన్నీ గాలించాం కాని దాని కిష్టమైన ఆ చీర దొరకలేదు. దేవుడా అంటూ టౌన్‌లోకి వెళ్లాం అక్కడ ఒక షాపులో ఆ చీర దొరికింది. "ఎంత" అంది.

"నూట ఎనభై ఎనిమిది రూపాయలు" అన్నాడు.

"అమ్మో అంత ధరే! ఇచ్చే ధర చెప్పు" అంది.

ఎలా అయితేనేం షాపువానితో యుద్ధంచేసి రెండు రూపాయలు తగ్గించింది.

వాడుపొట్లాం కట్టి ఇచ్చాడు.

"డబ్బివ్వండి!" అంది.

"నా దగ్గరలేదే నీ దగ్గరుందేమోనని నేనొట్టినే వచ్చాను...!"

"చాల్లెండి!" అంటూ నా జేబులో పర్సుతీసి కాషియర్‌కు డబ్బు ఇచ్చి రశీదు తీసుకుంది. రామరామ ఎంతపనిజరిగింది! మా ఆఫీసు హెడ్ ఇవ్వాళ్ల నాకు డబ్బు ఇచ్చి జాగ్రత్త చెయ్యమన్నాడు 'నా కెందు కిచ్చాడంటే 'డబ్బంటూ కొంపలో వుంటే ఆ చీర కావాలి! ఈచీరకావాలి!" అని వాళ్లావిడ ప్రాణం తీస్తుందిట. అందుకని ఈ నెలలో కొంత తీసి నాకిచ్చి "నీ దగ్గర దాయిరా భాయీ" అన్నాడు నేను "వద్దో" అన్నాను, వాడా వింటేనా! ఇంకేం ఇది కాస్తా మా శ్రీమతి ఖాళీచేసింది. వాడికెలా సమాధానం చెప్పాలో!

శ్రీమతి నన్ను కనక్కు లాగింది. "మరీ అంత పరధ్యానమైతే ఎలా కొద్దుమీద!" అంటూ.

సంక్రాంతి నాటిరాత్రి......

"ఏమిటి అంత పరాగ్గా వున్నారు?" అంటూ గదిలోకి వచ్చింది.

"అదికాదు లీల! షాపుదగ్గిర నీకిచ్చినడబ్బు నాదికాదు నాఫ్రెండు నా దగ్గిర దాచిపెట్టమని!"

"ఓవ్ అదాసంగతి మరేం ఫర్వాలేదులెండి. మీ సంగతి తెలిసే నేను డబ్బు తెచ్చాను మీ దగ్గిరుండగా నా డబ్బు ఖర్చు పెట్టట మెందుకని మీ డబ్బే ఇచ్చేశాను. మీ కంతగా అవసరమైతే ఇస్తాలెండి."

"నీ దగ్గిర డబ్బెక్కడిదీ?"

"కొంత వెనకేశాను సరా? ఏమండీ!"

తల పైకెత్తి చూశాను. ఆ క్రేప్ సిల్కు చీర కట్టుకొని వచ్చేసరికి మా శ్రీమతి నిజంగా శోభనపు పెళ్లికూతురై వచ్చినట్లుంది. నాకు తమలపాకులు చుట్టి ఇస్తూ-"ఎలావున్నాను?" అంది నవ్వుతూ.

'అచ్చంగా; ఆనాటి శోభనపు పెళ్ళికూతురిలా వున్నావు! అ సిగ్గూ ఆ వయ్యారము తళుకూ బెళుకూ!'

"చాలెద్దురూ మీ పొగడ్త మరీనూ! మరి నాకు ఏం బహుమతి ఇస్తారు ఈ సంక్రాంతికి?" అంది నవ్వుతూ.

"ఇలా రా!" అంటూ దగ్గరకు పిలిచి, "శోభనపు పెళ్ళికూతురికి పెళ్లికొడుకిచ్చే బహుమతి ఇదే" అంటూ బుగ్గమీద గిల్లి పెదివుల నందించాను. ఆ పైముందుకు జరిగినా హృదయంలో చోటు చేసుకుంది.

—(౦)—

# చేతితో పనిచేసే కొత్తరకం వాషింగ్ యంత్రం

—(౦)—

## ప్రతి ఇంటిలోనూ ఉంచుకోటానికి వీలైనట్టిది

చేతితో బట్టలను ఉతకడం అనాదిగా వస్తున్న విషయమే. ఎలక్ట్రిక్ వాషింగ్ యంత్రాలు ఎక్కువ వ్యయంతో కూడినవి కనుక, ఇండియా మొదలైన దేశాలలో వాటిని విరివిగ ఉపయోగించలేకపోతున్నారు. కాని ఆ దేశాలలోకూడా చేతితో ఉతకకుండా యంత్ర సహాయంతో వస్త్రాలు శుభ్రించేసే శుభ సమయం త్వరలో రాబోతున్నది. ప్రపంచంలో నలుమూలల స్థాపింపబడిన అమెరికా ఆపరేషన్స్ మిషన్‌కు చెందిన గృహ ఆర్థిక వ్యవహారాల నిపుణుల అభ్యర్థన ననుసరించి అమెరికా అంతర్జాతీయ సహకార నిర్వహణసంస్థ ఒక చౌకరకం, చేతితో పనిచేసే వాషింగ్ యంత్రాన్ని ప్రత్యేకంగా తయారు చేసింది.

పిస్టన్ సూత్రాన్ననుసరించి పనిచేసే ఈ యంత్రాన్ని కొయ్యతో తయారు చేశారు. దానిని నిర్మించేటందుకు వడ్రంగంలో పెద్ద ప్రావీణ్యత ఉండనక్కరలేదు. మామూలు కలపతో దానిని తేలికగా తయారుచెయ్యవచ్చును.

అమెరికా వ్యవసాయశాఖ తన కర్మాగారంలో తయారుచేసిన ఈ యంత్రం తొలి నమూనాను మేరీల్యాండ్‌లోని బెల్ట్స్ విల్‌లో ఉన్న హోమ్ ఎకనమిక్ లాబొరేటరీలలో పరీక్షించారు.

స్టాండర్డ్ ఎలక్ట్రికల్ కమర్షియల్ వాషింగ్ యంత్రాలలో పోల్చిచూసినప్పుడు ఈ కొత్త యంత్రం ఏమాత్రం నాసిగా లేదని పాటవ పరీక్షలవలన తేటతెల్లమయింది. వాటి నమూనాలు పన్నెండింటిని ప్రపంచంలో వేర్వేరు దేశాలలో ఉన్న అమెరికా అంతర్జాతీయ సహకార సంస్థ కార్యాలయాలకు పాటవ పరీక్షల నిమిత్తం పంపిస్తున్నారు.

బట్టలు ఉతకటానికి మనం అవలంబించే పద్ధతులకంటే ఈ కొత్త విధానం తప్పకుండా లాభసాటిగా ఉంటుంది. బట్టలను చిన్నచిన్న చెక్కలతో కొట్టిగాని లేదా బండకేసి బాదిగాని ఉతికే దానికంటే ఈ పద్ధతి ఎంతో మేలుగా ఉంటుంది.

అక్కడక్కడ ఇనపమేకుల బిగింపుతప్ప ఈ పరికరమంతా కొయ్యతోనే చేయబడినదనవచ్చును. వీటిని ఎక్కువగా తయారుచేస్తే ఒక్కొక్కటి ఇంచుమించు 8 డాలర్లు అంటే సుమారు 14 రూపాయలకు గిట్టుబాటు అవుతుంది. ఒక్కటే తయారు చెయ్యడానికి కాస్త డబ్బు ఎక్కువ కావలసి వస్తుంది. ఒక కుటుంబానికి ప్రత్యే

కంగా యంత్రం తయారు చెయ్యడం ఎక్కువ ఖర్చు అనుకుంటే, కొందరుకలిసి ఉమ్మడిగా తయారుచేయించి వాడుకొన వచ్చును. దానిని వాడుకొనేవాళ్లు ఎక్కువయినకొద్దీ మరమ్మతులుకూడా ఎక్కువవుతూ ఉంటవి.

సాధారణ వాషింగ్ యంత్రాలలో సుడి గుండంలాగ తిరిగే నీళ్లలో బట్టలు కూడాతిరుగుతూ, ఆ వగవడికి మురికికూడా వదిలిపోతుంటుంది. కాని ఈ కొత్త యంత్రంలో బట్టలు ఇంచుమించు కదల కుండాఉండి, వాటిద్వారా నీరు పైకి క్రిందికి ప్రవహించి మురికిని పోగొడుతుంది.

కొద్దిపాటి వ్యయంతో, సులభంగా చేతితో తయారుచెయ్యకలిగే ఇలాంటి వాషింగ్ యంత్రాలు ప్రపంచం నలుమూలలా ఎంతో ఉపయోగకరంగా ఉంటవి. ఈ యంత్రంవలన దుస్తులు మొదలైనవి బాగా ఉతకబడి శుచిగా, శుభ్రంగా ఉంటవి. ప్రతి గృహానికి ఇది అవసరం. తత్ఫలితంగా ఆరోగ్య సౌధంలో మరో మెట్టు పైకి పోగలం.

——(০)——

# కొత్తరకం విక్రయశాల

హువాంగ్ ట్సుంగ్-ట్సాయ్



ఈ మధ్య నేను షాంగైలోని హువైహాయ్ రోడ్డులోనున్న ఒక కొత్త రకం విక్రయశాలను చూడడం తటస్థించింది. అది నాకు చాలా ఆశ్చర్యాన్ని కలుగజేసింది. ఆ దుకాణంలో వస్తువులు అమ్మడానికి ప్రత్యేకించి మనుష్యులు లేరు. ఎవరు కొనుక్కోవలసిన వస్తువులను వారు యేరుకోవడమే ఆ దుకాణపు ప్రత్యేకత.

ఆ దుకాణం విశాలమైన రెండు గదులలో అమర్చబడి ఉన్నది. అంతా కొత్త పద్ధతుల్లో యేర్పాటు చేయబడి ఉన్నది. వస్తువులు అద్దాల బీరువాలలో అమర్చబడలేదు. తీసుకోడానికి వీలుగా మామూలు సొరుగుల బల్లలలో ఉంచబడ్డాయి. సొరుగుల బల్లలు (ర్యాక్స్) నాలుగు గోడలంటి ఉన్నాయి. చొక్కాలు, సబ్బులు, థర్మాస్ ఫ్లాస్కులు, పండ్లు తోముకొనే బ్రష్‌లు,- ఒక్కటేమిటి అన్ని రకాల వస్తువులు ఆ బల్లలపైన ఉన్నాయి.

కొనుక్కోడానికి వచ్చినవారు యోపికచేసి తెచ్చుకొన్న వస్తువులకు బిల్లులు తయారుచేసి డబ్బు వసూలు చేయడానికి ఇద్దరు కాషియర్లు మాత్రం ద్వారాల దగ్గర కూర్చొని ఉన్నారు. కాషియర్లే వస్తువులను పొట్లాలు కట్టి యిస్తుంటారు. ఎడతెరిపి లేకుండా వచ్చిపోయేవాళ్ళకు వస్తువుల ప్రాశస్త్యాన్ని గురించి తెలియజేయడానికి ప్రత్యేకంగా ఒక మనిషి ఉన్నాడు. కొందరు విద్యార్థులు అల్లికదుస్తులను ఏరుకొంటున్నారు. కాని యే సైజువి తమకి సరిపోతవో వారికి తెలియడంలేదు. అప్పుడు కొనుక్కోడానికి వచ్చిన వారిలో ఒకరు అక్కడున్న ఒక బోర్డును చూపెంచారు. దానిమీద ఇలా ఉన్నది. "సరిగ్గా సరిపోయే సైజు కావాలంటే మీ వక్షం కొలతకు 5 సెంటిమీటర్ల పొడవు యెక్కువ గల దానిని తీసుకోండి." అది చూడడంతోనే విద్యార్థుల సమస్య తీరిపోయింది.

కాషియర్ బల్లదగ్గర నిలబడి నేను "ఈ పద్ధతి అనుకూలంగానే ఉన్నదా," అని వస్తువులు కొనుక్కోడానికి వచ్చిన ఒక మనిషిని అడిగాను. "అవును ఇదేపద్ధతి బాగున్నది. ఎన్నో రకాలైన వస్తువులు నా ముందుంటాయి. ఒక దానితో ఒకటి పోల్చి చూచుకొని నాకు నచ్చింది యేరుకొనగలుగుతాను." అంటూ అతడు జవాబు చెప్పాడు.

అమ్మకం చేయడానికి వేరే మనుష్యులు లేకపోయినా కొనుక్కోడానికి వచ్చినవారు వస్తువులను పరిశుభ్రంగానే ఉంచుతుంటారు. లేతరంగుల వస్తువుల అమ్మేచోట ఒక తడిగుడ్డ ఉంచబడింది. దుస్తులను ఏరుకొనేవారు చేతులను యీ తడిగుడ్డతో ముందుగా తుడుచుకొంటారు.

ఈ కొత్తపద్ధతి దుకాణాన్ని ప్రజలు బాగా ఆదరిస్తున్నారని ఆ విక్రయశాల మేనేజర్ వాంగ్ చెంగ్-హ్సియాంగ్ తెలియజేసాడు. విక్రయశాలలకూ, కొనుక్కొనేవారికీ మధ్య యీవిధంగా పరస్పర విశ్వాసం పెంపొందుతున్నది.

—X—

ఇద్దరు వాదించుకుంటూ ఒకడు ''నీతో మాట్లాడేకన్న కుక్కతో మాట్లాడడం మేలు'' అన్నాడు ఉద్రేకంతో.

అందుకు రెండవవాడు ''అవునవును! కుక్కలు మనుష్యులతో మాట్లాడవు'' అన్నాడు వెటకారంగా.

యస్. చిరంజీవిబాబు




ముఖ్యంగా అట్లతద్దె, ఉండ్రాళ్లతద్దె పండుగలకు ఆడపిల్లలు గోరింటాకును రుబ్బి వ్రేళ్లకు మెత్తుకుంటారు. దానివల్ల గోళ్లు, అరచేతులు ఎఱ్ఱగా రంగుపూసినట్లు అగును. కొందరు కాళ్లకు పారాయణంకూడ పెట్టుకుంటారు. గోరింటాకు వైద్యోపయోగములుకూడ గమనించతగినవి.

గోరింటాకును, సునాముఖియాకును రుబ్బి ప్రతిరోజు రాత్రి తలకు పట్టించుకొని, మరునాడు తలార స్నానము చేయుచుండినచో నెరసిన వెంట్రుకలు నల్లబడును ఇలాగే గోరింటాకులను, సునాముఖియాకులను, నీలయాకులను బాగుగా రుబ్బి తలకు పట్టించుకొనినచో వెంట్రుకలు నల్లబడును.

గోరింటాకులను మెత్తగా నూరి అందులో తగుమాత్రంగా సాంబ్రాణి పొడినిగాని, గుగ్గిలము పొడిగాని కలిపి, అందులో నువ్వులనూనెబొట్లు కొంచెము వేసి బాగుగా మర్దించి కణతలకు, నుదురునకు పట్టు వేసినయెడల తలనొప్పిబాధ నివారణమగును.

మసూచిక రోగులకు గోరింటాకుల రుబ్బిన ముద్దను అరికాళ్లకు పట్టించినయెడల వ్యాధి కండ్లకు సోకదు.

గోరింటాకులముద్ద నక, కేశములను పెంచును. గోరింటాకు కషాయమును నోట పుక్కిలించి ఉమ్మివేసినచో నోటిలోని పొక్కులు, పూత, దుర్వాసనలు హరించును. గోరింటాకుతో తయారుచేయబడిన మలాములు పుండ్లను, వ్రణములను త్వరగా మాన్పును.

అరికాళ్లమంటల నివారణకు గోరింటాకును పచ్చిది బాగుగా నూరి గుడ్డలో మూటకట్టి, నిప్పుసెగన వేడిచేయుచు అరిపాదములకు కాపడము కాచినచో తప్పక నివారణ కాగలదు. కాలిన పుండ్లను గోరింటచెక్క కషాయముతో కడుగవచ్చును.

గోరింటాకు వైద్యశాస్త్రరీత్యా బాహ్యోపయోగములకేకాక లోనికి సయితము తీసికొనసగును.

'సి సి'

# మెట్రిక్ పద్ధతి




మీరు కొనేటప్పుడైనా సరే, అమ్మేటప్పుడైనా సరే మెట్రిక్ తూకాలు, కొలతల పద్ధతి లెక్కలు కట్టడానికి ఎంతో సులువుగా వుంటుంది.

దేశ మంతటా తూకాలు, కొలతల విషయంలో ఒకే పద్ధతి ఉన్నట్లయితే, అది వ్యాపారాభివృద్ధికే కాక, జాతీయైక్యతకు కూడా దోహదం చేస్తుంది.

| వ్యాపార తూకాలు ఈ క్రింది విధంగా వుంటాయి | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పోత ఇనుము తూకాలు | | | ఇత్తడి/కంచు తూకాలు | | | | | | |
| | | | కడ్డీలు మాత్రం | | సామానులు, కడ్డీలు | | | | |
| కిలోగ్రాము | | గ్రాము | కిలోగ్రాము | | కిలోగ్రాము | గ్రాము | | | |
| 50 | 5 | 500 | 20 | 5 | 1 | 500 | 50 | 5 | |
| 20 | 2 | 200 | 10 | 2 | | 200 | 20 | 2 | |
| 10 | 1 | 100 | | | | 100 | 10 | 1 | |

**1 కిలోగ్రాము = 1,000 గ్రాములు = 86 తులాలు**

1958 సం. అక్టోబరు ఒకటవ తేదీనుండి వివిధ రాష్ట్రాలలోని ప్రత్యేకంగా పేర్కొనబడిన కొన్ని ప్రాంతాలలోనూ, కొన్ని పరిశ్రమలలోనూ మెట్రిక్ పద్ధతి తూకాలు, కొలతలు అమలుజరిపే కార్యక్రమం చట్టబద్ధ మయింది. ఈ పద్ధతి క్రమంగా దశల వారీగా దేశమంతటికీ వర్తింపబడుతుంది.

భారత ప్రభుత్వంవారిచే జారీచేయబడినది.

DA 58/320 B-T G

# సడలని బంధాలు

శ్రీమతి డి. వాణి (సరస్వతి)

—(౦)—

'విమలా!

బాబుకి సీరియస్‌గా ఉంది. వెంటనే రావాలి. ప్రకాశరావు' టెలిగ్రాం చదివిన విమల స్తంభించి పోయింది. 'అమ్మా! అమ్మా' అంటూన్న చిట్టి బాబు దీనస్వరూపం కళ్ళముందు మెదిలింది. దుఃఖం పొంగివచ్చింది.

'ఏడుస్తున్నా వెందుకమ్మా?' అంటూ తండ్రి ఎదురుగా వచ్చాడు.

'బాబుకి సీరియస్‌గా ఉందట. జ్వరం వచ్చింది.' అన్నది బాధగా.

'ఈ నాటికి తన పొరపాటు గుర్తించాడన్నమాట' అన్నాడు కోపంగా.

ఆ రాత్రే తండ్రీ కూతుళ్లు బయల్దేరారు.

♦ ♦ ♦

ఆ రోజుల్లో విమల బి. ఏ స్టూడెంటు. సౌందర్యవతి, మధురగాయని అయిన విమలను ప్రకాశరావు ప్రేమించాడు. అతను యం. యస్. సి ప్యాసై ఆ కాలేజీలోనే లెక్చరరుగా ఉన్నాడు. ధనవంతుడు. విమలతో కోరి పరిచయం చేసుకొని పలుకరించేవాడు.

ప్రకాశరావు వివాహ ప్రస్తావన తెచ్చేసరికి విమల ఆశ్చర్యపడింది, తనకు అతనితో సరితూగగల స్తోమతు లేదని చెప్పింది. కాని పవిత్రప్రేమకు డబ్బు ఒక్కనాటికీ అడ్డుగోడ కాజాలదని ప్రకాశరావు వాదించాడు. మొదటినించి అతనిపై సదభిప్రాయంలో ఉన్న విమల చివరకు ఒప్పుకుంది.

వేసంగి సెలవుల్లో విమలా ప్రకాశరావుల వివాహం జరిగిపోయింది.

♦ ♦ ♦

సంవత్సరం గడిచిపోయింది. విమలకు కొడుకు కలిగాడు. ప్రకాశరావుకి కొలంబియా యూనివర్శిటీ నించి రిసెర్చికి సీటువచ్చింది. విమలకు ఆనందం, బాధ కలిగాయి. మూడేళ్ళవరకు భర్తను వదిలి ఉండాలని దిగులుపడింది.

'చదువుకున్నదానివి. అంత బెంగేమిటి విమలా! మూడేళ్ళూ ఇట్టే గడిచిపోతాయి' అంటూ ఊరడించాడు.

పసికందు నెత్తుకున్న విమల కన్నీళ్లతో భర్తకు వీడ్కోలిచ్చింది. బరువెక్కిన హృదయంతో ప్రకాశరావు ప్లేన్ ఎక్కాడు.

♦ ♦ ♦

డాక్టరేట్‌తో తిరిగివచ్చిన ప్రకాశరావును విమల తండ్రి, బాబు రిసీవ్ చేసుకున్నారు. బాబు చనువుగా తండ్రిదగ్గరకు వచ్చాడు. ప్రకాశరావు కళ్లు విమలకోసం వెతికాయి. కాని ఆమె కనబడలేదు. ఇంటికి వెళ్ళారు.

'విమలా! నామీద కోపమా?' ప్రకాశరావు మృదుస్వరం విని విమల తలెత్తింది. అతని కళ్లు తిరిగాయి. ఆమె సుందరరూపం పూర్తిగా మారిపోయింది.

'ఏమిటి విమలా!' బాధగా అరిచాడు. విమల కళ్లు అశ్రుపూరితాలయాయి.

'క్రిందటి వేసవిలో మశూచికం వచ్చింది' అన్నది గద్గదస్వరంతో. ప్రకాశరావు నిలువలేక మౌనంగా వెళ్ళిపోయాడు. ఎన్నో సంగతులు చెబుతాడని ఊహించిన విమల తెల్లబోయింది.

సాయంత్రం ప్రకాశరావు పిక్చర్‌కి వెళ్ళాడు.

'ఎంతో అందంగా ఉండే విమలను పొందగలిగానని లెక్చరర్ ప్రకాశరావు గర్వించాడు. తగిన శాస్తి అయిందిలే.' వెనుక సీటులో ఎవరో అనుకుంటున్న మాటలు అతని చెవులకు సోకాయి. వెంటనే లేచి వెళ్లిపోయాడు.

విమల రూపం కళ్ళముందు మెదిలింది. అవును! ఆమెను యిక యే ముఖంతో వెంటబెట్టుకొని పార్టీలకు, క్లబ్బులకు వెళ్లగలడు! ఇక నామెతో జీవితం కొనసాగించడం యెట్లా? అందగత్తె అయిన భార్య లేకపోతే చదువు, డబ్బు, హోదా వృథా! ఆలోచనలతో సతమత మౌతూ ప్రకాశరావు యిల్లు చేరాడు.

♦ ♦ ♦

ప్రకాశరావు విమలతో సన్నిహితంగా వుండలేక పోయాడు. సాధ్యమైనంతవరకు తప్పించుకొని తిరగ సాగాడు. తనను ఓదారుస్తాడని, తనలో రేగిన ఆవేదన కరిగిపోతుందని ఊహించిన విమల అతని లోని మార్పు చూసి క్రుంగిపోయింది.

'నేనేం తప్పుచేశాను?' అని అడిగింది కాఫీ యిస్తూ.

'నన్ను విసిగించక వెళ్లిపో విమలా!' ఆమెను చూడకుండానే చికాకుగా అరిచాడు. ఒకనాడు తన దర్శనం కోసం యెదురు తెన్నులు చూసిన ప్రకాశరావేనా యీ మాటలనేది! విమల నిర్ఘాంత పోయింది.

'ఈనాడు నా రూపంలో వచ్చిన మార్పు మీ కోపానికి కారణం కావచ్చు కాని...! కాని అది నా తప్పుకాదు. మీరు బాహ్యసౌందర్యాన్ని కాక, ఆత్మసౌందర్యాన్ని ఆరాధించారనే భావనతో నా దిగులుని అణచుకున్నాను. అది అపోహ అని తెలిసి పోయింది.' విమల కంఠంలో ఆమె హృదయవేదన తొణికిసలాడింది.

'ఛీ! నాకీయింట్లో సుఖంలేదు. బాబుని తీసుకొని వెళ్లిపోతాను,' అన్నాడు.

'సరే! నేను మీకు అడ్డుగా ఉండదల్చుకోలేదు. కాని ఒక్క మాట! బాబు నా సర్వస్వం. వాడిని నానుంచి దూరం చేస్తే బ్రతుకలేను' అన్నది కన్నీళ్లతో.

'వీల్లేదు బాబు నావాడు-నా యిష్టం.' ప్రకాశరావు విసురుగా వెళ్లిపోయాడు.

ఆ రాత్రే ప్రకాశరావు బాబును బలవంతంగా తీసుకొని వెళ్ళిపోయాడు.

♦ ♦ ♦

'బాబుపై బెంగతో విమల మంచంపట్టింది.

'నిన్నే చూసుకొని బ్రతుకుతున్నా నమ్మా! ప్రకాశం యేనాటికైనా మారకపోడు. దిగులు పడితే నేను చూడలేను విమలా!' అనేవాడు తండ్రి దీనంగా. తండ్రిమాటలతో విమల లేని ధైర్యం తెచ్చి పెట్టుకొని తిరగసాగింది.

విమల బి. యి డి. లో చేరింది.

'నీవు ఉద్యోగం చేయడం నా కెంతమాత్రం యిష్టంలేదు. కోరి చేసుకొని యింత మూర్ఖంగా అన్యాయం చేస్తాడని అనుకోలేదు. కేసు పెట్టి ముప్పు తిప్పలూ పెట్టాలి.' అనేవాడు కోపంగా.

'కేసులవల్ల డబ్బు రాబట్టుకోవచ్చును కాని అతనిలో లేని అనురాగాన్ని కొని తెచ్చుకోలేం కదూ! అతన్ని బాధించడం నా అభిప్రాయం కాదు,' అనేది బాధగా. ట్రైనింగు పూర్తికాగానే విమలకు ఉద్యోగం దొరికింది. తండ్రీ కూతుళ్ల జీవితం సాఫీగా గడిచిపోసాగింది.

♦ ♦ ♦

ప్రకాశరావుకి ఢిల్లీలో ఉద్యోగమైంది. బాబుని చూచుకొందుకు ఆయాను పెట్టాడు. కొందరు తిరిగి వివాహం చేసుకొమ్మని సలహా యిచ్చారు. కాని యెందుకనో అంగీకరించలేకపోయాడు. ఏదో లోటుతోనే రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. బాబుని మరిపించడం యెంతో కష్టమైపోయింది.

బాబుకి అయిదో యేడు వచ్చింది. స్కూల్లో చేర్పించాడు. కాని బాబుకి తల్లిలేనిలోటు బాగా కన్పించసాగింది. స్కూలు విడవగానే పిల్లలంతా

'మమ్మీ, మమ్మీ' అంటూ పరుగెత్తేవారు. విమల రూపం లీలగా ఆ పసి హృదయంలో మెదిలేది. దిగులుగా ఉండిపోయేవాడు.

బాబు దిగులుగా ఉండటం ప్రకాశరావు పసి కట్టాడు. ఎక్కువ శ్రద్ధతో ఏమేటూ కనిపించ నివ్వకుండా ముద్దుగా చూచుకోసాగాడు.

ఆ నాడు బాబు పుట్టిన రోజు. క్రొత్త బట్టలు, పిండివంటలు తయారైనాయి. కాని వాటివైపే చూడలేదు.

'నీకింకా యేంకావాలి _ చెప్పు బాబూ!' అంటూ బుజ్జగించాడు.

'నాకు అమ్మ కావాలి నాన్నా!' బాబు ఆశగా తండ్రి కళ్ళలోకి చూశాడు. ఆ మాట ప్రకాశరావు హృదయాన్ని బాణంలా దూసుకు పోయింది.

'సరేలే బాబూ! అమ్మను రమ్మంటాను' అని లేచి వెళ్ళిపోయాడు.

బాబు అమ్మకోసం ప్రతి రోజూ తండ్రిని వేదించసాగాడు. ఒక్కొక్కసారి ప్రకాశరావుకి విసుగెత్తేది. బాబును పంపించేయాలనుకొనేవాడు. కాని బాబును వదిలిఉండలేనని బాధపడేవాడు.

ఆ రోజు బాబుకి జ్వరం వచ్చింది. ప్రకాశరావు సెలవుపెట్టి యింటి దగ్గరే ఉండిపోయాడు.

'నాన్నా! అమ్మ యెప్పుడొస్తుంది నాన్నా!' అని బాబు దీనంగా పలవరించసాగాడు. ప్రకాశ రావుకా పలవరింత సమ్మెటపెట్టులా ఉండేది. మందు లిప్పిస్తే మనోవ్యాధి నయంకాదని అనుభవం మీద బోధపడింది.

'అబ్బాయికి కావలసిన వ్యక్తిని రప్పిస్తేకాని ప్రయోజనం ఉండదు,' అని పెదవి విరిచాడు డాక్టరు. ప్రకాశరావులో ఆవేదన తలెత్తింది. విమలను వదిలి రావడం అన్యాయమని, తల్లీ పిల్లలను వేరుచేయడం మహా పాపమని అంతరాత్మ ఘోషి స్తోంది. విమలతో గడిపిన మధుర జీవితం కళ్ళకు కట్టింది. సంసారం సుఖప్రదంగా ఉండటానికి సౌందర్యం కారణం కాలేరదని అర్థమైంది. రెండేళ్లా సారంలేని జీవితం గడపవలసి రావడం స్వయంకృతాపరాధమని తోచింది. బాబు ముఖంలో ఆమె దీనస్వరూపం మెరిసింది. వెంటనే టెలిగ్రాం యిచ్చాడు,

◆ ◆ ◆

'చూడు బాబూ నీ అమ్మని! వచ్చాను.' విమల ఆత్రుతగా బాబు మంచంమీద కూర్చుని బాబుని ఒడిలోకి తీసుకుంది. ఆమె చల్లని స్పర్శతో బాబు కళ్లు తెరిచాడు. 'అమ్మా!' అంటూ విమలను పెన వేసుకున్నాడు. ఆ దృశ్యం ప్రకాశరావును కదల్చి వేసింది.

విమల రాకతో బాబు జ్వరం తగ్గిపోయింది. ఉత్సాహంగా తిరగసాగాడు. ప్రకాశరావు సిగ్గుతో విమలతో ఒక్క మాట కూడ మాట్లాడలేకపోయాడు.

వారం రోజులు గడిచాయి. ప్రకాశరావు వ్రాసు కుంటూంటే బాబు ఏడుపు ముఖంతో తండ్రి దగ్గరకు వచ్చాడు.

'అమ్మ వెళ్లిపోతుందిట. నన్నూ రమ్మంది. నిన్నొదిలి వెళ్లను నాన్నా! నాకు అమ్మకూడ కావాలి! అమ్మను ఉండమను!' బాబు మాటల కాతని హృదయం కరిగిపోయింది. ఇక మౌనంగా ఉండలేకపోయాడు. బాబు నెత్తుకొని విమల దగ్గరకు వెళ్లాడు. ఆమె యేడుస్తోంది.

'విమలా,' ప్రేమ పురస్సరమైన పిలుపు విని ఆమె త్రుళ్లి పడింది.

'ఒకసారి నిన్ను కాదని జీవితంలో ఓడిపోయాను విమలా! తిరిగి ఆ పొరపాటు చేయ్యదల్చుకోలేదు. నన్ను మన్నించి నీ ప్రేమైక హృదయంలో స్థానం యిస్తావని ఆశిస్తున్నాను. నీకిక దూరంగా ఉండ లేను విమలా!' అన్నాడు రుద్ధకంఠంతో. విమల చెవులకామాటలు పన్నీటి జల్లులైనాయి, పెదవులపై చిరునవ్వు మెరిసింది.

ప్రకాశరావు హృదయంలో ఆనందం ఉరకలు వేసింది.

'అమ్మ యిక్కడే ఉంటుంది బాబూ!' అన్నాడు, బాబు సంతోషంతో స్నేహితుల వద్దకు పరుగెత్తాడు.

విమల సంతోషంతో ప్రకాశరావు హృదయం మీద వాలిపోయింది.




# యుకుంగ్ కొండలను కదిపిన వైనం

యు కుంగ్ (పిచ్చిముసలివాడు) దాదాపు తొంభై సంవత్సరాల పండు ముసలి. అతని జీవితంలో చీకాకును కల్పిస్తూవచ్చినవల్లా ఆ ముందున్న రెండుకొండలు. కొండలకు అటువైపుకు వెళ్లాలంటే వాటిచుట్టూ తిరగ వలసివచ్చేది, లేకపోతే వాటిపైకి యెక్కి అటు దిగవలసివచ్చేది. అందువల్ల చాలా అవస్థగా ఉంటుండేది.

ఒకనాడు ఆ ముసలాడు తన కొడుకుల్నీ మనమల్నీ పిలిచి ఇలా అన్నాడు.

“మన ఇంటిముందున్న యీ రెండు కొండల్నీ చదును చేయాలనుకొంటున్నాను. మీరేమంటారు?”

వాళ్లందరికీ ఆ కొండలంటే చీకాకుగానే ఉన్నదిగాబట్టి అందుకు వారు వెంటనే అంగీకరించారు. యుకుంగ్ భార్య మాత్రమే సందేహిస్తూ “నువ్వు ముసలివాడివై పోయావు. కొండలుచూస్తే అంతయెత్తు ఉన్నాయి. వాటినెలా చదును చేస్తావు? పోనీ వాటిని త్రవ్వినా, ఆతవ్విన దాన్ని యెక్కడ పోస్తావు?” అన్నది.

“ఏం పరవాలేదు. అదంతా తీసుకుపోయి సముద్రంలో పారవేస్తాము,” అన్నారు కుయాంగ్ కొడుకులు.

కుయాంగ్ కొడుకులు, మనమల్లతో కలిసి పనికి పూనుకొన్నాడు. కొందరు త్రవ్వడం ప్రారంభించారు. మరికొందరు త్రవ్వినమట్టిని రాళ్లను తీసుకు వెళ్లి సముద్రంలో పారవేయసాగారు. ఈ విధంగా కష్టపడి పనిచేస్తూవచ్చారు.

కుయూంగ్ చేస్తున్నపనిని గురించి వినగానే ఇరుగు పొరుగువారుకూడ వచ్చి సహాయం చేయసాగారు.

ఇలా పని జరుగుతూ ఉండగా చిహ్సౌ (వివేకవంతుడు) అనే పండితుడొకడు అటుపోతూ చూడడం తటస్థించింది. యుకుంగ్ చేస్తున్నపనిని చూచి అతడు పగలబడి నవ్వుతూఇలాఅన్నాడు! “ఏమిటీ వెర్రితనం! ఎంత మూర్ఖత్వం! నువ్వు చూస్తే పండుముసలివి. కొండలు చూస్తే అంత పెద్దవి. వాటినియెలా చదును చేయ

గలవు? నువ్వు యీ ప్రయత్నం మానుకోవడం మంచిది.''

అందుకు యుకుంగ్ ఇలా సమాధానమిచ్చాడు. ''నేను ముసలివాడినన్న మాట నిజమే. కాని నేను చచ్చిపోయినా యీ పనిని కొనసాగించడానికి నా కొడుకులూ, మనుమలూ ఉన్నారు. నా కుటుంబం అభివృద్ధి అవుతూనే పోతుంది. కాని ఆ రెండు కొండలు మాత్రం ఇంతకంటె పెద్దవి కాలేవు కదా? అటువంటప్పుడు దాన్ని యెందుకు చదును చేయలేము?''

చిహ్సౌ యుకుంగ్ మాటలను ఒప్పుకున్నాడు.

యుకుంగ్ తన పనిని నిర్విరామంగా చేసుకొంటూ పోసాగాడు.

భగవంతునికి యీ విషయం తెలిసి యుకుంగ్ పట్టుదలను మెచ్చుకొని ఇద్దరు దేవతలను పంపించాడు. ఆ యిద్దరు దేవతలు ఒకరాత్రిలోపల ఆ రెండు కొండలు మరి కనబడకుండా చేసివేశాయి. అది మొదలుకొని యుకుంగ్ ఇంటిముందు చదునైన చక్కని బాటయేర్పడింది.

——(०)——

# అశ్వం - యెద్దు

శ్రీ బొడ్డుపల్లి వెంకటప్పయ్యశర్మ

ఒక గ్రామంలో గొప్ప విద్వాంసు లిద్దరుండేవారు. వారిద్దరూ విద్యాసంపన్నులవడమేగాక స్వంతః సోదరులుగూడ. వారి నోడించగల పండితుడు ఆయాదరిదాపులలో లేదంటే నమ్మదగిన విషయమే. గ్రామప్రజలు వారిద్దరి నామములను యేకంచేసి రామకృష్ణశాస్త్రిలు అని పిలుస్తూ యుండేవారు:

రామశాస్త్రి పెద్దవాడవటంచే పిన్నవయస్కుడైన కృష్ణశాస్త్రి కంటె యెక్కువ ప్రజ్ఞాశాలియనే గర్వముండేది. కృష్ణశాస్త్రిగూడ రామశాస్త్రికంటె తీసిపోదగినవాడు మాత్రం కాడు. ఆతగాడు గూడ రామశాస్త్రిని తన తర్కశాస్త్రమందు అవలీలగా నోడించేవాడు.

ఇట్లా కొంతకాలము గడిచేసరికి వారిలో పండిత గర్వం పొడజూప జొచ్చినది. క్రమంగా ఆయిద్దరిలో వైషమ్యం వృద్ధికాజొచ్చింది. అయినప్పటికీ ఆ యిద్దరూ ఒకరు నొకరికి తెలియకుండానే ఆ దేశరాజుగారి ఆస్థానములో జేరుతలంపుతో ప్రయాణం సాగించారు. యెలాగైతేనేం! ఇద్దరూ ఆ మహారాజుగారి కృపకు పాత్రులైయారు. ఆ స్థానపండితులుగా నియమించబడ్డారు. కాని వారిద్దరిలోను అభిప్రాయభేదములుండుట గాంచిన రాజుగారు వారి యావద్వృత్తాంతము గ్రహించగలిగారు.

మహారాజుగారు ఒకనాటి సాయంసమయమున విహరిస్తూ రామశాస్త్రితో - ''యేమండీ మీ సోదరుడు కృష్ణశాస్త్రిగారిని గూర్చి మీ అభిప్రాయమేమిటి?'' అని ప్రశ్నించారు.

అందుకు జవాబుగా రామశాస్త్రి మహారాజుగారితో-''చిత్తం, మహాప్రభూ! వాడెంత, వాడి తెలివెంత? వాడు వట్టి అశ్వం'' అని యేదేదో పెద్ద ఉపన్యాసం దంచేశాడు మనస్సులోని ఉక్రోషం పట్టలేక

ఆ మరుసటి దినమే మరల యేకాంతములో కృష్ణశాస్త్రిని కలిసికొని అదే ప్రశ్నను కురిపించారు మహారాజులు.

కృష్ణశాస్త్రి గూడ తన సోదరునిపై గల ద్వేషమును ప్రకటిస్తూ - "మహారాజా మా అన్నగారి విషయమే చెప్పాలా! వాడు ఒట్టి వెధవయెద్దు. విగ్రహం పుష్టికి మాత్రం సరిపోతాడేగాని మరెందుకూ కొఱగాడు" అని యేదో చెప్పబోతూ రాజుగారికి విసుగు గలుగుతుందని తన సోది చాలించాడు.

ఇట్లా ఉండగా ఒకరోజున రాజుగారి పుట్టిన రోజు పండుగ వచ్చింది. ఆరోజు భారీయెత్తున విందుకు యేర్పాట్లు సాగుతున్నాయి. విందుకు యిద్దరు పండితులూ ఆహ్వానింపబడ్డారు. రాజుగారే పండితులను సత్కరించారు. ఒక గదిలో ప్రత్యేకంగా ఆయిద్దరు పండితులకూ వడ్డన యేర్పాట్లు జరుగుతున్నాయి. పండితులిద్దరూ కొఱకొఱలాడుతూనే విచ్చేశారు. ఒకరి నొకరు తమ ముఖములను చూచుకొని ఛీదరించుకొంటూనే తమ ఆసనములపై బైఠాయించారు. వారి తలలు తమ తమ విస్తళ్ళవైపు వంగినయ్. కాని వారి వారి విస్తళ్ళలో గుగ్గిళ్ళు, గడ్డి కనిపించాయ్. రామశాస్త్రిగారు తమ కళ్ళను తామే నమ్మలేకపోయారు. కళ్లు నులుముకొని చూచారు. కాని వారి విస్తట్లో గడ్డిమాత్రమే యున్నది. ప్రక్కనే తమ్ముని విస్తట్లో చూచారు. అక్కడ గుగ్గిళ్లు సిద్ధంగా ఉన్నయ్. ఇద్దరికీ విందునుచూచి పట్టలేనంత ఆశ్చర్యం కలిగింది. యిద్దరూ ఒకరిముఖాలొకరు చూచుకొన్నారు. వారి తప్పులు జ్ఞాపకానికి వచ్చాయ్. సిగ్గుతో తలలు వంచారు.

తరువాత వారి జీవితాంతంవరకూ విరోధమనునది లేశమాత్రమైన లేక మైత్రితో సుఖంగా కాలం గడిపారు.

బాలలూ! చూచారు గదూ! మీరు గూడ రామశాస్త్రిలు, కృష్ణశాస్త్రిలు అని వేరుగా పిలువక రామకృష్ణశాస్త్రిలు అని ఒకేమారు పిలుస్తారు గదూ

——(०)——

# ఇద్దరు స్నేహితులు

కుమారి చివుకుల కనకమ్మ

ఒక గ్రామంలో ఒక బ్రాహ్మణ బాలుడు, గొల్లపిల్లవాడు చాల స్నేహముగా నుంటూయుండిరి. ఎక్కడికి పోయినను యిద్దరు కలసివెళ్లుచుండిరి. ఆపత్సమయాలలో పరస్పరము సహాయము చేసికొనునట్లు కలియబలుకుకొనిరి. ఇలా కొంతకాలము జరిగెను.

ఒకసారి యీ యిద్దరు బాలురు ఒక అడవిగుండా ప్రయాణము చేయవలసి వచ్చెను. వారలా పోవుచుండగా సింహపు గర్జనలు వినబడెను. మరికొంత సేపటికి దూరంలోఎలుగుబంటి యొకటి కనబడెను. ఆయరవులకు, ఎలుగుబంటిని చూచి వారిద్దరు భయభ్రాంతులైరి. బ్రాహ్మణబాలుడు గబగబవెళ్లి సమీపానున్న మర్రిచెట్టెక్కి ఆకులమధ్య కనుపించకుండా దాక్కున్నాడు. గొల్ల పిల్లవాడికి చెట్టు ఎక్కడం తెలియక భయముతో గజగజ వణకుతూ చెట్టుమీదనున్న బ్రాహ్మణ బాలునితో "మనమిద్దరము ఎంతో

స్నేహంగానుంటూ ఆపదలలో ఒకరి కొకరం ఆదుకొందామనుకొన్నాము కదా! నీవు చెట్టెక్కి ప్రాణాలను రక్షించుకున్నావు, నాకు చెట్టు ఎక్కడం రాదు — నాగతేం కావాలి? నీవు నాకు చేయు సహాయ మిదేనా!'' అని ఏడ్వసాగాడు.

బ్రాహ్మణబాలుడు ''మనిద్దరము ఆపదలోనేయున్నాము కాబట్టి ఎవరిప్రాణ మును వారము రక్షించుకోవలసియున్నది. నాకు తెలిసిన విధంలో నన్ను నేను రక్షించు కొంటిని. నిన్ను నివు రక్షించుకో'' మనెను.

గొల్లపిల్లవాడు ఏమిచేయడానికి తోచక ప్రాణములపై ఆశవదలి కుప్పకూలి ఊపిరి బిగపట్టి నేలమీద చచ్చిన పీనుగలాగ పడు కొనెను. సింహాము మరొకవైపు వెళ్లెను. ఎలుగుబంటి పడియున్న బాలుని దగ్గరకు వచ్చి చూచి శవముగా నెంచి దానిదారిన అది వెళ్లెను.

తర్వాత కొంచెము సేపటికి బ్రాహ్మణ బాలుడు చెట్టుదిగి రాగా గొల్లపిల్లవాడు లేచి ''నీవు నమ్మతగిన వాడవు కావు. నమ్మతగని వారితో స్నేహము చాల ప్రమాదకరము. ఇకనుండి ని దారి నీది, నాదారినాది'' అని చెప్పి వెళ్లిపోయాడు.

కాబట్టి ఆపదలలో, కష్టాలలో విడ నాడే స్నేహితులను నమ్మరాదు.



# కామాయని


మూలం :
శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ :
శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ, బి. ఏ.


(అక్టోబరు సంచిక తరువాయి)

## సంఘర్షణ

కడకు శ్రద్ధకనిన కల వాస్తవమై భయంకర ప్రళయము సంభవించెను. సారస్వత నగరమున, యావత్ప్రజయును భీతావహులై మనువును శరణు జొచ్చెను. మనువు వారికి సానుభూతిని చూపక పోవుటయేగాక, నిరాదరించుటచే ప్రజలు కోపోద్రిక్తులైరి. ఆతని సరసనే వికలస్వాంతయై కనుపించిన 'ఇడ'ను చూచి వారి కోపమినుమడించెను. బయట జనసంఖ్య హెచ్చుటయేగాని తరగుటలేదు. ఉద్రిక్తప్రజానీకము నడ్డగింపలేక ప్రతీహారులు ద్వారములను మూసిరి. మనువు తన భవనమున నొకచోట చింతాక్రోధ సమానవృత చిత్తుడై యాలోచింపదొడగెను.

"నేనీనగరము నెంత ప్రశంసాపాత్రముగ పరిపాలించితిని. చక్కని రాజ్యాంగ సూత్రములతో నిగృంఖల వర్తనులైన ప్రజలనే కాత్రిత మొనర్చితిని! కాని కృతఘ్నులై ప్రజలు నేడు నాకే విరుద్ధముగ ప్రవర్తించుచున్నారే! ఇడపై నే నేదో యత్యాచార మొనర్చి ప్రళయ కారకుడనైతినని తలచుచున్నారు కాబోలు నే!—"

"ఆ ... నేను చేసిన నియమములకు బానిసను కావలెనా? నా మనోభీష్టమును నెరవేర్చి కొనుటకై నాకేమాత్ర మధికారము లేదా? కనీసము నా యిచ్ఛ వచ్చినట్లుండుటకై నాకు స్వాతంత్ర్యము లేకుండ, నా నియమపాశములకు బద్ధుడను కావలెనా? నేను శ్రద్ధతో సాంగత్య మొనర్చి, యామెకు స్వాత్మార్పణ మొనర్పకుండనే నా యిచ్ఛ ననుసరించి ప్రవర్తించితిని. నా స్వేచ్ఛకు శ్రద్ధ తానొక యాటంకము కాలేదు. కాని 'ఇడ' మాత్రము నన్ను నియమములతో బంధింప జూచుచున్నది! ఆమె నా యధికారము నిర్బాధిత మనియు, పరిపూర్ణమనియు నెన్నడును అంగీకరించలేదు!

కాని ఏమైనను నా యధికారము నిరాటంకముగా నొనర్పలేని, స్వతంత్రుడనై స్వమనోనుకూల వృత్తితో జీవితము గడపెదనుగాక! ఈశ్వర ప్రపంచమునందే నిముసమున చిన్న సౌఖ్యమైనసరే, ప్రాప్తించునో అదియే మూల్యవంతమైన సమయము. మిగిలిన కాలమంతయు వ్యర్థస్వప్నము, అని మనువు యోచించుకొనుచు వెనుదిరిగి చూడగనే ఇడ యచ్చట నిలబడియుండెను. ఆమెను మనువిట్లు సంబోధించెను.

మనువు:-ఇడా, ఇట కేలవచ్చితివి? ఇంతవరకు కల్పించిన యుపద్రవములు చాలలేదా, ఏమి? చేయవలసిన యుపద్రవములు చేయనే చేసితివి! మరేమి మిగిలినదో?

ఇడ:-మనూ! శాసనకర్తయే, శాసనములను పాలించనిచో, శాసనముల నుల్లఘించినచో, సర్వమును వినష్టమగునుకదా?-మనువు మరియొకపరి యామెను తీవ్రదృక్కులతో మౌనముగ సమాధానమిచ్చెను.

ఇడ:-మనూ, సర్వప్రజలును, నీయధికారము నంగీకరించి నీ శాసనములకు లోనై జీవించుచున్నారు. వారలొకింత స్వతంత్రముగా తమ యాశాపూర్తిని కోరునది దోసమేనా? ఓ ప్రజాపాలక మహారాజా! లోకములో నిదివరకెన్నడైన నేప్రత్యేక వ్యక్తియైన, ఏకైక నిరంకుశాధికారము ననుభ

మించినాడా? తన సుఖములకొరకే యన్యుల సౌఖ్యమును కూడ వాంఛించుట యోగ్యుని లక్షణము. అందువలన మనూ! నీ గమనమును లయ తాళ బద్ధము నొనర్చుము! జీవనరాగమున నపస్వరము రానీయకుము! ప్రజావాళిని గమనింపుము!

మను:—అటులనా! జీవితమునంతయును ఇతరుల సుఖసాధనములకై వ్యతీతమొనర్చి, నేనుమాత్ర మట్టి తృప్తిని వాంఛించుట పాపమన్నమాట! ఈ లోకము లయమందినచో, అప్పుడు నేనే సౌఖ్యమును పొందెదను? సుందరీ, నేను మాత్రము భోగవాంఛను పరిత్యజించజాలను! లోకమున ప్రళయము రానిమ్ము, మరే యుపద్రవమైన రానిమ్ము, నీపై సంపూర్ణాధికారమే నేను వాంఛింతును. నిన్నుమాత్రము వదలబోను, రా, బాలా, రా,

ఇడ:—మనూ, మంచి మాటలు నీ చెవికెక్కనిచో నేనేమి చేయగలను! అటుచూడు ప్రకృతి భయంకర స్వరూపమును దాల్చినది, క్షుబ్ధులైన ప్రజలు నీకు శరణాగతులగుచున్నారు! మనూ ... నేనిక నీకడ నుండజాలను.

మను:-ఇడా, నిన్నిపుడు పోనీయను. అన్ని నియమములను, బాధలను దూరమొనర్చి, ఆశావిహీనమైన నా జీవితమున కొక్కసారియైన సుఖప్రదాన మొనర్చుము. ఐశ్వర్యమునుగాని, రాజ్యమును గాని నేనిప్పుడే తృణప్రాయముగ త్యజింతును. నా సర్వోపాయములతో నిన్ను స్వాధీనమొనర్చుకొందును. నీయందలి భోగములతో తృప్తుడనై సర్వసౌఖ్యములను చూరగొందును.

ఇడ:—నా సద్బోధలను పెడచెవిని బెట్టకు. ఇంతవరకు నీకు ప్రాప్తమైన యున్నతిని కాలదన్నకు. మనూ! ప్రకృతితో పోరాడు నుపాయములను తెల్పి, ప్రకృతియందు చిందరవందరగాపడియున్న దివ్యైశ్వర్యముల నన్నిటిని సమకూర్చి నిన్ను దాని కధిపతిగా నొనర్చినాను! అట్టి నా యుపకారముల నిట్టె మరచినావు! కాని మనూ, నీ కేమి చెప్పి దానికే తల యూపుట మాత్రము నా వల్ల కాని పని —మనూ ... ఇప్పటికైన మించిపోలేదు. కర్తవ్యోన్ముఖుడవు కమ్ము. అవతల ప్రజాకోటి. నీకై వేచియున్నది. ఇక నేనేమియు చెప్పజాలను. మనూ, నేనిదే పోవుచుంటిని, నీవు సావధానముగా నుండుము.” మనువున కామె మాట చెవికెక్కలేదు. అతనిలోని వాసనలు బలీయములై తీవ్రస్వరూపమును ధరించినవి. ‘ఇడ’ సింహద్వారము వైపు నడచిపోవుచుండగా నామెను తన భుజపాశములతో బంధించినాడు. ఇడను కౌగిటజేర్చి “ఇంతవరకు నీవు యథేచ్ఛా వర్తన మొనర్చుచుంటివి. కాని అది నేడంతమైనది. నేనిక నీ దాసుడనై నీ ప్రేమ నర్థించలేను. ఇడా, నేను స్వతంత్ర ప్రియుడనైన శాసకుడను. నా జీవనమును సఫల మొనర్చునట్టి భోగానందమును నీయందనుభవించుటకై నాకు పరిపూర్ణాధికారము కావలె. దానిని నేను వాంఛించుచున్నాను. ప్రళయము కానిమ్ము, విలయము కానిమ్ము...” అనుచుండగనే సింహద్వారము పెద్ద శబ్దముతో బ్రద్దలయ్యెను. జనులు బిగ్గరగా కేకలిడుచుండిరి. ఆ జనసముదాయమును చూడగనే మనువుగుండె బలము కోల్పోయెను. అతని యంగములతో పాటు తరంగము కూడ కంపించసాగెను. ఒకింత తడవున కాతడు ధైర్యమును తెచ్చుకొని, వజ్రదండమును చేబూని యాగ్రహముతో నిట్లనెను. “ఓ, ప్రజలారా! మీరు పశుతుల్యులై తిరుగాడుచున్న సమయమున, శాసనముల నేర్పరచి, మానవత యొక్క ప్రథమపాఠములను నేర్పినది నేను! జీవితమును తృప్తికరముగ గడుపుకొనుటకై యుపాయములను తెలిపినది నేను! అట్టి నా యుపకారములను విస్మరించి కృతఘ్నులై మీరేల నా సౌఖ్యమున కవరోధములుగ నిలుచుచున్నారు?

మనోవేదనా పీడితులైన ప్రజలు మనువునకిట్లనిరి.

"ప్రజాపాలకా, నీవు మాకు చెయ్యని యపకారమేమున్నది? మమ్ముల లోభులుగా మార్చి మా మానసిక శాంతిని దోచుకొంటివి! వైజ్ఞానిక శక్తులనావిష్కరించి, మా ప్రకృతి శక్తులను క్షీణింప జేసితివి! పైగా అన్నిటికంటె మించి, మా రాణిపైన శేనీవత్యాచార మొనర్చుటకు వెనుదీయకుంటివి! ఇట్టి పాపకృత్యముల నొనర్చుటకేనా నీ విటకు వచ్చినది? నీ యౌద్ధత్యమును సహించుట మాకిక దుష్కరము. నిన్నిప్పుడే యంతమొందింపగలము... జాగ్రత!"

ప్రజావాణి మనువునకు లోన మండుచున్న క్రోధాగ్నిలో పోసిన యాజ్యమైనది. "ఐనచో వినుడు, నేను ప్రకృతి జేతను, దాని సంతతి జేతను ఏకాకినై పోరుటకు జీవన రణరంగమున సిద్ధముగ నున్నాను. నేడే నా పౌరుష ప్రతాపమును, నా రాజ్య దండపు వజ్రకాఠిన్యమును మీరలు చవిచూతురు గాక!" అనుచు నిజాస్త్రమగు వజ్రదండమును కేల బూని, ప్రజాసమూహముపై లంఘించెను, ప్రజకూడ పూర్ణశక్తులతో మనువును ప్రహరించినను, మనువును తత్ప్రహారములు లేశమైన బాధింపకుండెను. విప్లవకారులగు ప్రజలను చీల్చిచెండాడుచు నాతడు పురోగమించెను. ప్రజలకు సాయపడి పోరాడుచున్న కిలాతుడు, ఆకులి అను నసురపురోహితులు కూడ మనువుచేత మడసిరి.

"సమరము నాపుడు! ఎందులకీ రక్తపాతము! అందరిని జీవింపనిండు, శాంతియుతముగా జీవనము నడపుడు" అనుచు 'ఇడ' ఆదేశపనిగ నరచెను. ఐనను ఆమె పలుకు లరణ్యరోదనము లైనవి. ఇంతలోనే ప్రళయరుద్రుని ధూమకేతువువలె ప్రళయాగ్ని జ్వాలల నీనుచు, భీషణ శస్త్రము లిరువైపులనుండి బయలుదేరెను. ఆ మహాశక్తి గగనముకూడ కంపించెను. తనకు యుద్ధరంగమున భీషణ శస్త్రాహతికి మృతప్రాయుడై నేల గూలెను. ప్రజానష్టముచే పృథ్విపై రక్తపుటేరులు ప్రవహించెను.

## నిర్వేదము

యుద్ధమంతమైనది. సారస్వత నగరమంతయును క్షుబ్ధమై మలినమై మౌనమయమైనది. నగరసమీపమున సరస్వతీ ప్రవాహతరంగశబ్దముల విశ్రమణ సమయములందు మాత్రము క్షతగాత్రుల దీనరోదనములు వినుపించుచుండెను. రాజసౌధాంతర్భాగమున శబ్దశూన్యతకు తోడుగా 'ఇడ' మాత్రముండెను. మనువచ్చటి, జ్వాలామయ కాష్టముల దరిని మృతప్రాయుడై పడియుండెను. ఇడ మనస్సు వేదనాపూరితమై గతించిన కాలమును గూర్చి యోచింపసాగెను. ఆ యతివయెదలో నొకవైపునుండి ప్రేమామృత జలధి తరంగములు పెల్లుబుకుచుండగా, మరియొక ప్రక్కనుండి ఘృణాసాగర బడబాగ్ని ప్రజ్వలించి, యామె హృదయమును తప్త మొనర్చుచు స్వర్ణసన్నిభ మొనర్చెను. ఆమె యందు విజృంభించిన మనోవృత్తులలో నొకటి, మాతృవృత్తి.

(సశేషము)



## నూతన నటులు ఎలా రూపొందుతారు ?

చలనచిత్రకళ బహుళ ప్రచారములోనే కాక ప్రజల ఆదరాభిమానములకు పాత్రమగుచున్న రోజులలో యీ కళ అన్ని హంగులతో బాటు ఉత్తమ నటీనటులను సయితము ఆర్జించుకోకలుగాలి. చలనచిత్రకళకు నటీనటుల నటనాకౌశలము, సంగీత సాహిత్యాలు ఆయువుపట్టు అను విషయము మరువరానిది. కాబట్టి చలనచిత్ర రంగానికి ఉత్తమ నటీనటులు కావాలి. అయితే నటీనటులు కావడం ఎలాగ ? అనే విషయం అనేకమందిని కలవరపరుస్తుంటుంది. సినిమాలలోచేరి నటించాలని కాస్తో కూస్తో డబ్బు పుచ్చుకొని నగరాలకు బయలుదేరివచ్చిన యువతీయువకులు వారికి యోగ్యతలున్నా ప్రాపకంలేక కొందరు, మరికొందరు ప్రాపకం లభించినా యోగ్యతలులేక పతనంచెందుతున్న వారనేకులు. దీనికంతటికి సినీనటీనటులుగా రూపొందడానికి వలసిన శిక్షణాయుతమైన యోగ్యతల లేమి కారణము. కాబట్టి యోగ్యతల ననుసరించి శిక్షణనీయగల చలనచిత్ర కళాకేంద్రాలు అత్యవసరము. ఈ కేంద్రాలు విద్యాలయాలతో సమానంగా క్రమబద్ధంగా నిర్వహించబడాలి.

సినీ నటీనటులుగా కాగోరువారు సాహిత్య, విజ్ఞానాలలో ప్రవేశపరీక్ష నెగ్గవలసియున్నది. శిక్షణకు అభ్యర్థుల నెన్నుకోడం సంగీత, సాహిత్య, నాట్య, నటనాకౌశలములుగల ప్రవీణుల సంఘమయి యుండవలెను. సినిమానటులయ్యే అర్హత, భావప్రకటనా సామర్థ్యం అభ్యర్థులకున్నదా లేదాయని ఆ సంఘము పరిశీలించి నిర్ణయించవలసి యున్నది.

సినిమాలలో చేరాలనే ఉబలాటం కలవారినుండి యిట్టి సంఘాలద్వారా పాత్రౌచిత్యాన్ననుసరించి చక్కగా నటించి, రాణించగలవారిని ఎన్నుకొనుటకవకాశములు అనేకం,

ఇట్టి శిక్షణ కేంద్రాలకు, చలనచిత్ర నిర్మాతలకు, నాటక సమాజములకు, పరస్పర సంబంధము అత్యంత సన్నిహితముగా నుండాలి. దీనివల్ల నిర్మాతలకు ఉత్తమ నటీనటులు లభిస్తారు. నాటక సమాజముల ద్వారా నటీనటులు తమ ప్రజ్ఞాప్రావీణ్యములను ప్రదర్శించుటకు, చక్కని నటనాకౌశలమును అలవరచుకొనుటకు అవకాశములు విస్తృతము కాగలవు. చలనచిత్ర నిర్మాతల, నాటక సమాజములద్వారా కళాపోషణ యథేచ్ఛగా జరుగగలదు. ఇంతేకాక నిర్మాతలు, దర్శకులు ఎప్పటికప్పుడు నూతన నటీనటులకు దేవులాడుకోడమో లేక ప్రాతవారిని ఎన్నుకోడమో కూడ అవసరముండదు. ఈ శిక్షణా కేంద్రాలద్వారా ఎందరో సుశిక్షణపొందిన యోగ్యులైన నటీనటులు రూపొందగలరు. ఇలా శిక్షణపొందే అభ్యర్థులకు చలనచిత్ర నిర్మాతల, దర్శకులద్వారా స్టూడియోలతోటి, చలనచిత్ర నిర్మాణంతోటి పరిచయముంటుంది కాబట్టి సహజంగా నటించకలుగడంతోబాటు సినిమానటనకు సంబంధించిన అనేక క్లిష్ట విషయాలను నేర్చుకుంటారు. ఈ కేంద్రాలలో నటన కళా విద్యార్థులు భావప్రకటనను గురించి, వాచ్యాన్ని గురించి నేర్చుకొనడమేకాక సాధారణ సాంస్కృతిక విద్యాభ్యాసాన్నికూడ పొందుతారు. నాటకరంగం, సినిమారంగముల చరిత్రను గురించి, సినిమాపరిశ్రమ

(64-వ పేజి చూడుడు)

# శ్రీ భక్త "బాబా" స్వామి కేశవయ్యాజీకి

గుంటూరు

శ్రీ సాయిబాబా భజన్ మండలివారు

సభక్తి సమర్పించిన

<u>స్వాగత సన్మాన పత్రము</u>

శ్రీ శ్రీ ప్రత్యక్ష బాబాజీ, స్వామీ, కేశవయ్యాజీ,

శా॥ సాయీశుఁ మరపించు "సాయిసుధలఁ". సారించుచున్, సంతత
**శ్రీ**యోదాయక భక్తిభావవిభవాశీస్సుల్ ప్రసాదించుచున్
మాయామేయ జగత్ ప్రవృత్తి శోకసన్మార్గ ప్రదానంబుగా
**చేయూత**ఁ గలిగించు "కేశవ" సుధా శీలంబునీదౌగదా
మహాభక్తాగ్రేసరా, శ్రీ సాయికటాక్ష వీక్షణసుధాకారా.

మీ శుభాగమముచే, మా సాయిభక్త భజన మండలియు, ఆ మహాసాయి భక్త మండలిచే గుంటూరు మహానగర భక్తబృందమును, ఆ మహాభక్తబృందముచే మానగర పౌరబృందమును, ఆ సమస్త భక్తబృందముచే అఖిలమానవ మహాబృందమును పవిత్రవంతమగుచున్నది. ఆ నాడు సాయిభగవానుని దివ్యలీలాసుధలలో దేదీప్యమానముగ దీపించిన భక్తిబీజములు మొలకలెత్తి పూలుపూచి, పిందెలై, కాయలై, నేటికి పరిపక్వఫలములై, ఈ నాటి ప్రత్యక్ష "బాబా, యో" యన భక్తిపారవశ్యమున ప్రస్ఫుటమగుచున్న మీదివ్య వాగామృత సాయి సుధాధారల నవరుచులన్ దేలుచు భక్తజన పారవశ్యమునకు పారితోషిక మొసగుచున్నవి. వేయేల ఆసాయీశుడే మీమనస్వాంతమున శాశ్వతనివాస మేర్పరచుకొని సద్భక్తి సారించుచున్నాడో ఆ సద్గురు సాయిసుధలే మీజిహ్వాగ్రమున, నవనవ్యనాదముల నాట్యమాడుచున్నాడో, ఆసాయీశుడే మరల యీ నాటికి మీ రూపమున మాకు సాక్షాత్కరించుచున్నాడో, వారికి శ్రీ సాయి భక్తబృందము సాష్టాంగ ప్రణామము లాచరించుచున్నది.

మహాత్మా! మీ ప్రభుత్వోద్యోగమును జీర్ణ చేలమువలె విసర్జించి, ధనాకర్షణా విముక్తులై, శాశ్వత దివ్యోద్యోగమున సాక్షాత్కరించి, నిరంతర సాయినామ స్మరణానందమును జూరగొనుచు, వివిధ బాధాపీడిత కేవిధ పరితాపబాధిత పాపపరివారమును పావన మొనర్చుచు, శ్రీసాయి సుధా దివ్యౌషధా సాధనంబున పాపానల కీలల వారించుచు, పరిపరివిధంబుల సాయిసుధల సారించుచు, ఏతత్ తీర్థప్రసాదంబుల సమస్తప్రాణుల సంరక్షించుచు, నిత్యము మీరు సువర్ణాక్షరముల లిఖించు భక్తిరచనలచే మానవాళిని రంజించుచు, మీ వివిధోపన్యాస వాగామృతధారల నాస్తికులను సైతమున్ ఆస్తికులజేసి భక్తాళి నలరించుచు, మీరు నేడు గావించుచున్న మహామానవసేవకు మానవలోక మెల్లయు కృతజ్ఞతాపూర్వక వందనార్చనమున మిమ్మర్చించుట మా విధి.

దివ్యపురుషా, మీ మహామహిమాన్విత మానవసేవయే మాధవసేవగా ప్రపంచ పీడిత పాపానలకీలల పరిమార్చి అఖిల మానవకళ్యాణ శాశ్వత ఇహపర సుఖానందదాయకమగు శ్రీసాయి సుఖసంజీవి సర్వదా సమర్పించుచుండుటకు తగిన దీర్ఘాయురారోగ్య మహా విభవంబును శ్రీసాయి భగవానుడు మీకు ప్రసాదించునుగాక.

ఇవే మీకు మా ధన్యవాదములు - సుస్వాగతము - ఓం తత్సత్ - ఓం, శ్రీం, సాయ్

రచన:- శ్రీ సాయిభక్త దామరాజు పుండరీకాక్షుడు 21-12-58




**భక్తమందారము:** కవిభూషణ కల్లూరి అహోబలరావుగారు. ప్రచురణకర్తలు శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల 12/433 నింకంపల్లిరోడ్డు, హిందూపురం, అనంతపురం జిల్లా. వెల రు. 1-25 న. పై.

ఇందులో గ్రంథకర్త ప్రతియొక్క పద్యములోను భక్తమందార నుద్దేశించి రెండువందల సీసపద్యములను మానవ జీవయాత్రలోని నీతినియమాలను, ప్రస్తుత జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను, వాతావరణమును వివరించుటతోబాటు తమలో గల్గిన జిజ్ఞాసను, ఆర్తిని, నిర్వేదమును వెళ్ళగ్రక్కియున్నారు. చక్కని సరళమైన కవిత్వము. ప్రతియొక్కరు పఠించి భావ, రస అనుభూతి పొందనగు పద్యములు. ఈ గ్రంథ పఠనము విజ్ఞానముతోబాటు మన స్వీయసమస్యలపట్ల ఆసక్తిని పెంపొందించగలదు.

**ఆహార తత్వదర్శిని:** శ్రీ సోమయాజుల శ్రీరామ దత్తాత్రేయశర్మ. ప్రతులకు శ్రీ మధిర కామేశ్వరరావు, శ్రీ లక్ష్మి ఆయుర్వేద నిలయము, తణుకు, ప. గోదావరి జిల్లా. వెల 75 నయాపైసాలు.

ఆహారం ఆవశ్యకతను గురించి ప్రతియొక్కరికి తెలుసు. కాని మన ఆహారపదార్థముల విలువలను వాని గుణగణాలను గురించికాని, ఉన్నంతలో ఉత్తమ ఆహారమును సేకరించుకొని సేవించుటకాని చాలమందికి తెలియదు. పదార్థవిజ్ఞానాన్ని వివరించే యీ చిన్నిపుస్తకము చాల ఉపయుక్తమయినది. ఇట్టి పుస్తకము పద్యములలో కన్న వచనంలో నుంటేనే బాగుంటుంది.

**గణాధిపతి:** శ్రీ పురాణపండ రామమూర్తి. ఆధ్యాత్మిక ప్రచార సంఘము, ఆలమూరు, తూర్పుగోదావరిజిల్లా. వెల 25 నయాపైసాలు.

ఇందులో వినాయక చవితినాటి విఘ్నేశ్వర పూజావిధానము, కథ కలవు. చక్కని ముద్రణతో తయారయిన యీ చిన్నపుస్తకం ప్రతియొక్కరి యింటిలో నుండతగినది.

**ఆత్మవిచారము:** శ్రీ వేదాంతం టి. సుబ్బయ్యశాస్త్రిలు. ప్రకాశకులు :సనాతన ధర్మతత్వ విచారసంఘము, పాకాల, చిత్తూరుజిల్లా. వెల 25 నయాపైసాలు.

ప్రస్తుత మానవలోకానికి ఆత్మవిచారము అత్యవసరము. ఇందులో ఆత్మవిచారమును ప్రబోధించుచు అనేక విషయములు వివరించబడినవి. ఆత్మవిచారము యీ నాటి కల్లోలిత ప్రపంచ సమస్యల ననేకము పరిష్కరించుటే కాక పారమార్థిక చింతను ప్రోత్సహించి ఆధ్యాత్మిక సంపదను పెంపుజేయును. ఇది చిన్నపుస్తకమైనా అమూల్యమైనది.

# సంపాదకీయములు

## బాలికల విద్య

బాలికలకు విద్యావకాశాలు విస్తృతం చేయడానికి ప్రభుత్వం పూనుకొనుండటం సంతోషింప తగిన విషయము. అయితే బాలబాలికల విద్యావిషయంలో శ్రద్ధవహించేముందు తల్లిదండ్రులు తమ బిడ్డలకు విద్య అవసరమని గుర్తించుట కనువైన విజ్ఞాన వికాసములు అత్యవసరము. అందుకుగాను వయోజన విద్యావ్యాప్తి పట్ల సయితము ప్రభుత్వము శ్రద్ధవహించవలసియున్నది.

ముఖ్యంగా బాలికల విద్య విషయంలో సంగీత సాహిత్యాలతో బాటు కుటుంబ సుఖసౌభాగ్యములకు తోడ్పడగల విద్యావిధానము రూపొంది బాలికలను, వారి తల్లిదండ్రులను యిప్పటికంటె ఆకర్షించ కలగాలి.

దీనితోబాటు విద్యావసతులు ప్రతియొక్కరికి అందుబాటులోకి రావాలి. ఆర్థిక అసమానత్వము విద్యాభ్యాసమునకు ఆటంకమైతేను, విద్యాభ్యాసము గుమాస్తాగిరి సంపాదనకు మాత్రమేనను అపోహ తొలగించలేకపోతేను విద్యావ్యాప్తికి చేసే ప్రయత్నాలు ఫలించవు.

## ప్రజావసరాల ధరల స్థిరీకరణ

ప్రజల నిత్యావసరాలైన కూడు, గుడ్డలాంటి వానివిషయంలో ఉత్పత్తిదారులకు, వినియోగదారుల పరస్పర సద్భావ, సహకార, సానుభూతులవసరం. ఇవి లోపిస్తే సంఘంలో అశాంతి చెలరేగగలదనే సత్యాన్నే మొన్న నెల్లూరులోని నిరాహార దీక్ష, పోలీసు కాల్పులు నిరూపించినవి. ఇట్టి అశాంతి నెల్లూరులో నొక్కచోటనేయనిగాని, మన ఆంధ్రదేశంలో ననేగాని అనుకోడం పొరబాటు. రోజు రోజుకు పెరిగిపోతున్న ప్రజల ప్రధానావసరాలైన ఆహారపదార్థాల ధరలకు ప్రజలు ఆర్థికంగా గిజగిజలాడి పోతుంటే తాము కాయకష్టంచేసి పండించేవారు కాకపోయినా భూస్వాములు అవకాశవాదులుగా ధాన్యం ధరను పెంచి అధిక లాభాల కొరకు ప్రాకులాడటం శోచనీయము.

ప్రజల నిత్యావసరాల ధరల తగ్గించుట, స్థిరీకరణ చేయుటకు ప్రభుత్వ యంత్రాంగములోని వ్యక్తులు వ్యవహరించుట అవసరము.



(51-వ పేజీ తరువాయి)

మూల సూత్రాలను గురించి, వారు తెలిసికోడానికి అవకాశాలుంటవి. ఇట్టి సుశిక్షణ మూలంగా రెండు సంవత్సరాలలో అపార అనుభవ, కౌశల్యాలు సమకూరి ప్రధాన భూమికలను నిర్వహించుటకు అవకాశము లేర్పడును. ఇట్టి సుశిక్షితులకు సినిమారంగంలో నిలకడైన అవకాశములు లభించగలవు.

చలనచిత్రంయొక్క విజయం ప్రధానభూమికలకవసరమయిన నటీనటుల నెన్నుకొనుటపైన, నటీనటుల ఉమ్మడి కృషిపైన చాల భాగం ఆధారపడి యుంటుంది. దర్శకుడు నటీనటుల నెన్నుకునేముందు అనేకమందిని పరిశీలించవలసియుంటుంది. అట్టి పరిశీలనకు యీ శిక్షణ కేంద్రాలు కావలసినంతమంది నటీనటులను పంపుట కవకాశముండును. దీనివల్ల నాటకరంగము, సినిమారంగము పరస్పర సహకార సహాయాలతో దేనికది వర్ధిల్లడానికి అవకాశములు కలవు. ఈ శిక్షణ కేంద్రాలలో నటనానుభవమే కాక నృత్య, సంగీత కళలలో సయితము ప్రావీణ్యము గడించినవారిని పాత్రౌచిత్యమున కనువుగా నెన్నుకోడానికి అవకాశముండును.

చలనచిత్రకళయొక్క పురోభివృద్ధికి నాటకరంగము సయితము సుశిక్షితులైన నటీనటులతో వర్ధిల్లుట ఎంతైనా అవసరము.

సి. సి. పున్నయ్య

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras
Ag. Editor : C. C. Punniah.

భారత ప్రశస్తి




**KESARI KUTEERAM Private LTD.**
MADRAS-14.

# లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి

